శ్రీ

# ముకుందమాలా

కవి

## శ్రీ కులశేఖరాళ్వారులు

టీకాకర్త

'బాలసరస్వతి' 'తర్కతీర్థ'

శ్రీ తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారు

అమరచింత ఆత్మకూరు సంస్థాన మహా విద్వాంసులు.

# ఆంధ్ర ముకుందమాల

కవి

శ్రీ 'శిరోమణి' చలమచర్ల రంగాచార్యులుగారు

తాళపత్ర గ్రంథ పరిశీలకులు

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.



ప్రకాశకులు

శ్రీమంత్ ముక్కర సవై, రాణి భాగ్యలక్ష్మమ్మ

బలవంత్ బహద్దరుగారు.

అమరచింత (ఆత్మకూరు) సంస్థానాధీశ్వరులు

నిజాంరాష్ట్రము.

౧౯౪౪

సర్వస్వామ్యము

అమరచింత (ఆత్మకూరు) సంస్థానాధీశ్వరులది.

ప్రతులు ౫౦౦.



ప్రథమ ముద్రణము

శ్రీ కురుమూర్తి శ్రీనివాస ముద్రాక్షరశాల

అమరచింత సంస్థానము.

౧౯౧౨



ద్వితీయ ముద్రణము

౧౯౪౪



వెల రు ౧-౦-౦



ప్రిమియర్ ప్రెస్

గంజ్‌బజారు, శికింద్రాబాద్.

శ్రీః

# విషయ సూచిక





# విజ్ఞప్తి

శ్రీ కులశేఖరాళ్వారులు సాయించిన జగత్ప్రసిద్ధమైన ముకుంద మాల అమరచింత (ఆత్మకూరు) సంస్థానాస్థాన ప్రధాన విద్వాంసులగు "బాల సరస్వతీ" "తర్కతీర్థ" తిరుమల, బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులవారి టీకా తాత్పర్య సహితముగా

శ్రీమన్మహారాజ సవై, రాజా శ్రీ రామభూపాల బల్వంతు బహద్దరు అమరచింత (ఆత్మకూరు) సంస్థానాధిపతుల కాలమున (౧౯౧౨) తదీయాస్థానస్థిత శ్రీ కురుమూర్తి శ్రీనివాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

పరిష్కృతము టీకా తాత్పర్యములతో ముద్రితములైన పెక్కు ముకుందమాల పుస్తకములు లభించుచున్నవి. ఐనను విశేషవివరణము, పాఠ భేదాదులలో విలక్షణమునై సంస్థానములో ముద్రితమైన ప్రతులనే కోరుచు అనేకులు శ్రీమంత్ సవై, రాణీ భాగ్యలక్ష్మమ్మ బల్వంతు బహద్దరు అమరచింత (ఆత్మకూరు) సంస్థానాధీశ్వరులకు తెలుపుకొనిరి. శ్రీ రాణీ బహద్దరుగారును భక్తుల యుపయోగార్థము తిరిగి ఆ విశిష్ట ప్రతిని ముద్రించుటకు ఆజ్ఞ నొసగిరి.

ఇందులో పదవిభాగ, టీకా, తాత్పర్య, అన్వయములకు ఇతర టీకా తాత్పర్య, పదవిభాగములకు ఉండు భేదమును దీని వైశిష్ట్యమును శ్రీమాన్ చలమచర్ల వ్యాకరణ శిరోమణి రంగాచార్యులవారు (ఉస్మానియా విశ్వవిద్యాలయము తాళపత్ర గ్రంథ పరిశోధకులు, ఆంధ్ర ప్రతాప రుద్ర, యశోభూషణ, అలంకార వసంత గ్రంథకర్తలు) వ్రాసిన యిందలి పీఠికవలన విశదమగును.

శ్రీమంత్ రాణీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరుగారి ఆజ్ఞానుసారము శ్రీమాన్ శిరోమణి రంగాచార్యులవారు ముకుందమాల శ్లోకార్థమునకు అన్యూనానతిరిక్తముగా వ్రాసిన తెలుగు పద్యములు ఈ పుస్తకములోనే చివర ముద్రింపబడినవి. వీరి కవిత పద లాలిత్యము గలిగి మూలానువాద సమర్థమై రమణీయముగానున్నది. ముంజేతి కంకణమునకు అద్దమేల ? ముకుందమాల కృతిరత్నమును పఠించి పాఠకులు తరింతురుగాక!

"జాతక విద్వన్మణి"
తిరుమల బుక్కపట్టణం వేంకటాచార్యులు
అమరచింత (ఆత్మకూరు) సంస్థాన విద్వాంసులు



# ముకుందమాలా పరిమళపీఠిక.

అఖిల భువన జన్మస్థేమ భఙ్గాదిలీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైకదీక్షే,
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

## స్తోత్ర వాఙ్మయము-ఆర్య మతము

అఖిల ప్రపంచ వాఙ్మయములోను ప్రాథమ్యమును, ప్రాధాన్యమును గూడ వహించినది స్తోత్రవాఙ్మయము. స్తోత్రము భక్త హృదయారవిందము విరిసి వెదజల్లు సౌరభము. భక్తుడు భగవంతునకు సమర్పించుకొనిన యమూల్య రత్నమాలిక యది. విశ్వస్వరూపునకు భక్త భావన దీర్చి దిద్దిన యొక సుందర చిత్రమది. భాగవత మధురానుభూతి దాల్చిన యక్షరస్వరూపమది. అతిపవిత్రమును, ఆది వాఙ్మయమునగు ఋగ్వేదము

'అగ్నిమీళే (డే) పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్న ధాతమమ్' అని తేజోరూపమున భగవంతు నధ్యవసాయముచేసి స్తుతించి స్తోత్రవాఙ్మయమునకుఁ బ్రతిపదికలు వైచినది. ఒక ఋగ్వేదముననే దాదాపు వేయి ఋక్కులు స్తోత్రరూపమున నున్నవి. ఈ స్తోత్రములే రాగయుక్తములుగా గానము సేయఁబడి సామములైనవి. ఆర్య ఋషిపుంగవులు భక్తి తొలకిసలాడ నీ సామలు గానముచేసియే సర్వేశ్వరుని తమ హృదయాధిష్ఠితునిఁ గావించుకొని పరమ నిర్వృతిఁ బొందఁజాలిరి. ఇట్లు వేదారూఢమైన స్తోత్రవాఙ్మయము క్రమముగ శాఖోపశాఖలై విస్తరిల్లినది. ఆర్య మతమునకే స్తోత్రవాఙ్మయము జీవితమువంటిదైనది. ఆర్యునకు త్రికాలములలోను భగవత్ స్తోత్రము (సంధ్యావందనాది రూపమున) విధి. మఱియొక మెట్టునకుఁ బోయి పాంచకాలికారాధనమునుగూడ ఆగమములు విధించినవి. భారతీయుని ప్రతి కర్మారంభము స్తోత్రముతోనే యగును. ప్రతి సత్కావ్య ప్రణేతయును తన కళాప్రావీణ్యమును భగవత్కైంకర్యమునకే వినియోగింప నెంచును. వేదములకుఁ బిమ్మట వెలువడిన వాఙ్మయమునను భగ

వద్గుణానుభవరూపమైన స్తోత్రమే ముఖ్యము. లౌకిక వాఙ్మయమున నాంది కావ్యమని పేరెన్నికగన్న శ్రీమద్రామాయణము వేదమువలె స్తోత్ర కావ్యమే. శ్రీ వాల్మీకి మహర్షి పుక్కిటిబంట భగవత్కథా సుధారసము గ్రోలి గండుకోయిలయై కవితాశాఖపై పంచమస్వరమున గానముచేసెను. అనేక పురాణములను రచించిన దిట్ట వ్యాసభట్టారకుఁడు, కొంత యాలస్య మగునైన నేమి తెప్పరిల్లి, భగవద్గుణములను స్తోత్రముచేసి తనవాక్కును పవిత్రముచేసికొని ధన్యుఁడయ్యెను. † విష్ణు, శివ, శక్తి ప్రభృతిగా నేదేనొక రూపమున ధ్యేయము నేర్పఱచుకొని స్తుతించి స్తోత్రవాఙ్మయమును ఆర్య భక్తకవులు కడుంగడు విస్తరిల్లజేసిరి.

ఆయా గ్రంథారంభములలోను, ఆయా గ్రంథములలోని కథా ప్రసక్తినిఁబట్టి యచ్చటచ్చటను వచ్చు స్తోత్రములు లెక్కకు మిక్కిలి యున్నవి. అట్టివి గాక కేవలము గ్రంథమంతయు స్తోత్రరూపముననే యుండు గ్రంథములే స్తోత్రగ్రంథములుగాఁ బరిగణింపఁబడినను; అవియు వేల సంఖ్యలోనికే వచ్చును. ఆయా మతములలోని స్తోత్రము లన్నింటి శీర్షికలను మాత్ర మొక పట్టికగా నిచ్చినను అది యొకపాటి గ్రంథమే యగును. ఇప్పటికి వెలువడిన బృహత్ స్తోత్రరత్నాకర, స్తోత్రకదంబ, స్తోత్రార్ణవాది గ్రంథములుకూడ అసంపూర్ణములేగాని కొంతవఱకుప యోగించును. వ్యాపారదృష్టితోఁగాక వాఙ్మయ సేవాదృష్టితో భారత దేశమునందలి యన్ని రాష్ట్రములలోను ఏ యార్యమత శాఖకు సంబం ధించిననైనను ఏ లిపిలో నున్నను ఒక సంస్కృతభాషలోనున్న స్తోత్రముల నైనను సేకరించి, ఉపలబ్ధమైనంతవఱకు స్తోత్ర కర్తృ కాల జీవితవిశేష ములతో నాగరి లిపిలోఁ బ్రకటించిన నది యొక విశ్వకోశమువంటి మహా గ్రంథమై సర్వజనోపయోగకారి కాఁగలదు.

భారతీయ ప్రధాన మతాచార్యులందఱును సంస్కృత స్తోత్ర వాఙ్మయమున (సంపూర్ణ స్తోత్ర గ్రంథములు) ముఖ్య భాగస్వాములే. వీరిలో ముఖ్యులగు కొందఱనుమాత్ర మిటఁ బేర్కొందును.

శ్రీ పుష్పదంత మల్హణ రేణుకాచార్యాదులు:—మహిమ్నస్తో త్రాదులు. శివపరములు.

---

† 'అసత్కీర్తన కాంతార పరివర్తన పాంసులాం
వాచం శౌరికథాలాప గంగయైవ పునీమహే'

శ్రీ శంకరాచార్యాప్పయదీక్షితాదులు:—శివానందలహరీ లక్ష్మీనృసింహ స్తోత్రాదులు, కొన్ని శివాత్మకములు-కొన్ని విష్ణుపరములు.

శ్రీరామానుజ శ్రీవత్స చిహ్నమిశ్రాదులు:— గద్యత్రయ పంచస్తవాదులు విష్ణుపరములు.

శ్రీమధ్వాచార్య రాఘవేంద్ర తీర్థాదులు:— ద్వాదశ స్తోత్రాదులు, విష్ణుపరములు.

వల్లభనింబార్క చైతన్యాదులును, కాశ్మీర శైవ శాక్తేయాచార్యులును ఈ ప్రస్తావమున నెన్నదగినవారే.

ఈ రీతిగ వేదోపబృంహితమై, ఋషిప్రోక్తమై, ఆచార్యానుగృహీతమై, కవిభక్తలాలితమై క్రమముగ పల్లవించి, కుసుమించి, ఫలించి లోకకల్యాణమును జేకూర్చిన స్తోత్రవాఙ్మయ కల్పవృక్షమున ఆరపండినదే ఈ ముకుందమాలా స్తోత్రము. *

## ముకుందమాల—అఖిలభారత వ్యాప్తి

సామాన్యముగా గ్రంథవ్యాప్తికి గ్రంథమందలి విషయము సార్వజనీనముగా నుండుట ముఖ్య కారణమగును. విషయ వైశద్యమునకుఁ దోడు సరసమైన శైలియుఁ గూడిన నిఁకఁ జెప్పవలసిన పని లేదు. బంగారమునకుఁ దావి యబ్బినట్లు. ద్రాక్షాపాకమునఁ బడిన వాల్మీకి కాళిదాసాది కృతులు సర్వవ్యాపకములగుటయు, నారికేళ పాకమువంటి బిరుసు పాకమునఁబడిన భారవి శ్రీహర్షాదుల గ్రంథములు కేవలము

---

* దేశభాషలలోను నీ స్తోత్రవాఙ్మయము అనంతముగ నున్నది.

౧. పాటలు, శతకములు, కీర్తనలు, కృతులు, రగడలు, వచనములు, దండకములు, సప్తపదులు, అష్టపదులు, మున్నగునవి తెలుఁగులో నున్నవి.

౨. తేవారము, విరుత్తము, పాశురము, తిరుప్పుహాళ్, పాడల్ అని అఱవమునున్నవి.

3. సాకి, దిండి, ఓవి, అభంగ, సాకు, చౌరంగి అని మరాటీలోనున్నవి

౪. పదగళు, గీతగళు, వచనగళు మొదలైనవి కన్నడమున నున్నవి.

౫. టుంరీలు, తోహారలు, భజనలు హిందీలోనున్నవి.

విద్వల్లోక వ్యాప్తము లగుటయు విద్వాంసు లెఱిఁగిన సంగతి. వేమన పద్యములు, సుమతి, కృష్ణ, దాశరథి శతకములు తెలుఁగు నాఁటఁబొందిన వ్యాప్తిని నూర్లకొలఁదిగ నున్న శతకములలో నెన్ని పొందఁగలిగినవి? నిజముగఁజూచిన అర్థాలంకార వస్తుధ్వని భూషితములేగాక యవి కొన్ని చిత్రాలంకార విచిత్రితములునై యున్నవే; మఱి! వ్యాప్తి యెక్కువ లేకుండుట కేమికారణము? వాని శైలి సర్వజనాకర్షకముగా నుండుటయే. చెప్పఁదలంచిన విషయమును సూటిగ పాఠకుని హృదయమున హత్తునట్లు చెప్పలేకపోవుటయే. పోతన భాగవతమునకుఁగల ప్రచారము తక్కిన గ్రంథరాజములకు లేకుండుటకును హేతు విదియే. ముకుందమాల విశ్వ భారతమును వ్యాపించి తావులు గుబాళించుటకును మూలకారణము దాని సారళ్యమే యనవలెను. కాశ్మీరములో నించిన కుంకుమపువ్వువలె, కాశీలోఁ బ్రవహించు గంగవలె కేరళములో నుదయించిన యీ ముకుందమాలయు సర్వభక్తసేవ్యమైనది. అకృత్రిమముగా, అప్రయత్న ముగా భక్తాగ్రేసరుఁడగు శ్రీ కులశేఖరుని పరిపక్వ హృదయమునుండి వెల్లివిరిసి ముకుందుని కంఠసీమ వనమాలయై మెఱసిన దీ ముకుందమాల. పుష్పపరిమళమును గ్రహించుటకు పండిత పామరు లొక్కతీరున సమర్థులైనట్లు లలితమైన ముకుందమాలను ఆబాలగోపాలము ధరించి ఆనందింపఁగలిగిరి.

వైదిక స్తోత్రములు గంభీరములై యంతంత వాని కందవు. పౌరాణిక స్తోత్రములు తత్త్వనిరూపణమునకుఁ బ్రవృత్తములై యాలస్యమునఁగాని హృదయావర్జకములు గావు. ఇట్టి లఘుస్తోత్రములే సులభముగాఁ గంఠస్థము చేయుటకు వీలై, ఏ కొంత భాషాజ్ఞానమున్నవారికిఁగూడ సగ్రాహ్యమై యధికారి భేదము లేకుండఁగ నందఱను ఆకర్షించును. వేదాంత పరిభాషలుగాని, జటిలపదములుగాని, అన్వయ కాఠిన్యముగాని, హేతు వాదముగాని లేని ముకుందమాల నానా దేశీయుల రసనాగ్రములపై అది యేభాషలోనున్న స్తోత్రమో యనికూడ విచారించుకొనవలసినపని లేనంత సరళముగా స్వమాతృభాషా పద్యమాలవలె విరాజిల్లుచున్నది. కావుననే యీ స్తోత్రరాజము ముద్రణములేని కాలమునఁగూడ ఎక్కడో కేరళము నుండి యెక్కడో కాశ్మీరమువంటి సుదూర దేశమునకుఁ బ్రాఁకినది. అచ్చట లభించిన విశిష్ట వ్రాఁత ప్రతినే క్రీ. శ. ౧౮౯౩లో కావ్యమాల ప్రథమ

గుచ్ఛములో నిర్ణయసాగర ముద్రాక్షరశాలవారు ప్రకటించిరి. అంతకు మున్నే కలకత్తాలోను, బొంబాయిలోను నిది ప్రకటితమయ్యెననియుఁ దెలియుచున్నది. † నాగరి లిపిలోను తక్కిన దేశభాషా లిపులలోను ముకుందమాల యిప్పటికి పెక్కుమారులు ముద్రింపఁబడినది. తెలుఁగు దేశములో ముద్రింపఁబడినవాని పట్టికను మాకు లభించినంతవఱకు సంవత్సర క్రమమున సిద్ధముచేసి పీఠికాంతమునఁ జూపితిమి. దీనివలనఁగూడ ముకుందమాల యెంత యెక్కుడగ సహృదయముల నాకర్షించినదో తెల్లమగుచున్నది.

## శ్రీ కులశేఖరాళ్వారులు

అమృతస్యందినియగు నీ ముకుందమాలను గానముచేసి తాను తరించి లోకమునుదరింపఁజేయు కల్యాణనాములు శ్రీ కులశేఖరాళ్వారులు వీరు 'ఆళ్వారులు' అని వ్యవహరింపఁబడు మహా వైష్ణవాచార్యులలో నొకరు. ఈ మహనీయుని పవిత్ర జీవిత విశేషముల నరయుటకు మున్నుగ నాయా యాళ్వారులను గూర్చి కొంత తెలియుట యవసరము గాన తొలుత ఆళ్వారులెవరో విచారించి పిమ్మట శ్రీ కులశేఖరుల చరిత్ర నందుకొందును,

## ఆ ళ్వా రు లు

'ఆళ్వార్' అను ద్రావిడ పదమునకు (తమిళము) 'మహాజ్ఞాని' యని యర్థము. † * మహాజ్ఞానులైన యీ ఆళ్వారులు శ్రీవైష్ణవ మతమునకు మూలస్తంభములు. మోక్షసౌధమునకు నిశ్రేణులుగాఁ బరిగణింపఁబడుచున్నారు. శ్రీవైష్ణవ మతమునకు ముఖ్యములగు భక్తిప్రపత్తులు వీరి ప్రధానలక్షణమైయుండెను. శ్రీమన్నారయణుఁడే పరతత్త్వమనియు, భగవద్భాగవత సేవయే ఆత్మోజ్జీవనమనియు నమ్మి మహా వైరాగ్యముతో జీవితము గడపిన మహానుభావులు. దక్షిణ భారతమున వైష్ణవమునకు బీజావాపము చేసి విష్ణు పారమ్యమును ముక్తకంఠమునఁ జాటిన

---

† చూ. కావ్యమాల ప్రథమ గుచ్ఛము ౧౧ పుట.

† Vidwan C. V. Subrahmanyam's note on Alwars.

* 'Alwar means one who has taken a deep plunge into the ocean of divine consciousness' says Suddhananda Swamy P. 3. See 'Alwar Saints'.

వారీ యాళ్వారులే. * ఉత్తరమునుండి బౌద్ధమతవాయువులు వీచి దక్షిణా పథమున దైవభక్తి సన్నగిల్లి క్రమముగ లోకము తమకు దామె గొప్ప వాండ్రమనుకొని యుత్పథమునఁబడిపోయి మొహికేచ్ఛ లెక్కువమై మహా నర్థమునకు దారితీసిన ఆపత్సమయమున నవతరించి భక్తి సుధాప్రవాహ ముతో లోకము నుద్ధరించిన భగవద్భూత లీయాళ్వారులు.

వారి సర్వస్వము శ్రీమన్నారాయణుఁడే. మనస్సు భగవంతుని భజించును. జిహ్వ వానిఁగీర్తించును. కనులు వానిఁగాంచును. కర్ణములు వానిఁగాథ వినును. కరములు వాని నర్చించును. పాదములు వాని నిల యమునకుఁ బ్రదక్షిణము సేయును. సర్వము ఆదేవదేవునిదే అను నిర్భ రాధ్యవసాయముగలపూర్ణయోగులు ఆళ్వారులు. రూపొందిన గీతాస్వరూ పులు ఆళ్వారులు. ఉజ్జ్వలించిన యుపనిషన్మూర్తులు ఆళ్వారులు. జలజల ధ్వానము చేయుచుఁ బాఱు దైవికానంద ప్రవాహములు ఆళ్వారులు, వేయేల ? నడయాడు పవిత్ర దేవాలయములు ఆళ్వారులు. †

ఆళ్వారుల సంఖ్య—పరంపర

† ఆళ్వారులు మొత్తము పండ్రెండుగురని పరిగణింపఁ బడు చున్నారు. గురుపరంపరలో వీరికొక క్రమమును ఏర్పాటు చేయఁ

---

* See Pages 282 and 283. 'Tamil Studies' of M. Srinivasa Iyengar M. A.,

† 'An Alwar is a golden river of love'
'An Alwar is a living Gita'
'An Alwar is a 'breathing Upanishad'
'A hymning tarrent of divine Rapture'
'A moving temple'
See p 3. 'The Alwar Saints' of Swamy Suddhananda Bharati.

† (A) గరుడవాహన పండితుని "దివ్యసూరిచరిత్రమ్" ౧౮౯౫ ఏప్రిల్ ౧౦వ తేదీని మైసూరు విద్యాతరఙ్గిణీ ముద్రాక్షరశాలలో ముద్రి తము.

(B) అనంతాచార్యుని "ప్రపన్నామృతమ్" ౧౨౫ సర్గల మహాకావ్య ము. బొంబాయి, మదరాసులలో ముద్రితము.

(C) తాళ్ళపాక తిరువేంగళనాథుని "పరమయోగివిలాసము" తెలుఁగు ద్విపద కావ్యము. శ్రీ పిఠాపుర మహారాజా వారగు శ్రీరావు

బడినది. ఆ క్రమమున ఆళ్వారుల తిరునామములను సంస్కృతములోను, తమిళములోను జేర్కొనబడినది. ఈపన్నిద్దఱాళ్వారులలోను గొందఱు ద్వాపరయుగమున నున్నట్లును కొందఱు కలియుగముయొక్క ఆదిలో నున్నట్లును గు రు ప రం ప రా దు లు జేర్కొనుచున్నవి. సంప్రదాయజ్ఞులును తిరునక్షత్రతనియలు (జాతకశ్లోకములు) ను ఆధారముగాఁ జేసికొని ఆళ్వార్లు కొందఱు పూర్వయుగమునను మఱికొందఱీయుగమునను ఉదయించిరనియే చెప్పుదురు. ఈ కాలనిర్ణయము కల్పితమనియు ఆళ్వారులంత ప్రాచీనులు గారనియు క్రీ. శ. ౬ శతాబ్దమునుండి ౯ శతాబ్దము లోపల ఆళ్వారులుండి యుందురనియు సర్. ఆర్. జి. భండార్కర్ మొదలగు చారిత్రికులయభిప్రాయము ‡ ఈవాదము సరికాదని సుప్రసిద్ధ చారిత్రకులగు డా. యస్. కృష్ణస్వామి అయ్యంగార్ ఎం. ఏ. గారు సప్రమాణముగ ఖండించి ఆళ్వారులు క్రీ. శ. ౨ వ శతాబ్ది మొదలుకొని ౮ వ శతాబ్దమువఱకు నున్న మధ్యకాలములో నుండియుందురనియు కాలమును బట్టి ఈపన్నిద్దఱు మొదటి భాగము, మధ్యభాగము, కడపటి భాగమునకుఁ జెందినట్లు మూఁడు విభాగము లగుదురనియు నుడివిరి. *

---

వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారిచే ౧౯౨ వలో కాకినాడ నగరమున ముద్రితము.

(D) నంబూరి కేశవాచార్య ప్రణీతము "ఆచార్యసూక్తిముక్తావళి" ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో వారిచే ముద్రితము. మద్రాసు.

See.

(E) Dr. M. Krishnamacharya's M A.M.L., History of the Sanskrit literature. P. 277.

(F) Dr. S. Krishnaswamy Aiyengar's (M. A.,) Early History of Vaishnavism in South India. P. 13.

(G) గురుపరంపరలు.

‡ See. 'Vaishnavism, Saivism and minor religions' by Sir R. G. Bhandarkar.

* See PP. 73. 75. in S. K. Aiyangars 'E. H. of Vaishnavism in South India.

## ఆళ్వారుల పరంపర

| | తమిళనామము | సంస్కృతము | సమయము | స్థలములు |
|---|---|---|---|---|
| ౧ | పేయాళ్వార్ | మహాయోగి | 860900 | మాయూరపురి I |
| ౨ | పూదత్తాళ్వార్ | భూతయోగి | 860900 | మల్లాపురి II |
| 3 | పొయిగయాళ్వార్ | కాసారయోగి | 860900 | కాంచీపురము |
| ౪ | మధురకవియాళ్వార్ | మధురకవి | 863879 | తిరుక్కోలూరు |
| ౫ | తిరుమళిశైయాళ్వార్ | భక్తిసారులు | 892901 | తిరుమళిశై |

ఈ అయిదుగురును ద్వాపరయుగమున నుద్భవించిన వారని చెప్పుదురు.

| | | | | |
|---|---|---|---|---|
| ౬ | కులశేఖరాళ్వార్ | కులశేఖర | కలి 28 | కోళిపట్టణము. |
| ౭ | నమ్మాళ్వార్ | పరాంకుశముని | ,, 43 | కురుకాపురి |
| ౮ | పెరియాళ్వార్ | విష్ణుచిత్త | 47 | ధన్విపురము |
| ౯ | ఆండాళ్ | గోదాదేవి | ,, 98 | శ్రీవిల్లిపుత్తూర్ |
| ౧౦ | తొండరడిప్పొడియాళ్వార్ | విప్రనారాయణ | ,, 107 | మండంగుడి |
| ౧౧ | తిరుప్పాణియాళ్వార్ | మునివాహన | ,, 162 | ఒరయూర్ |
| ౧౨ | తిరుమంగయాళ్వార్ | పరకాల | ,, 217 | పరిరంభాపురి* |

మహనీయులగు నీ ఆళ్వారులలో నొక్కొక్కరును భక్తిరస పారవశ్యమున గానము చేసిన పాశురములు తమిళ వాఙ్మయమునకే భూషణములయ్యెను. ఆళ్వారులు భగవంతునిపైఁ బాడిన యీపాటలకే పాశురము లనియు, ప్రబంధములనియు వ్యవహారము. ఈదివ్య ప్రబంధములన్నియు శ్రీమద్రామానుజాచార్యులవారికి ముందే † శ్రీనాథమునులచే నొక్కచో జేర్పఁబడినవి. అది మొత్తము ౪౦౦౦ పాశురములుగల యొక గొప్ప సంపుటమైనది. దీనికే నాలాయరదివ్యప్రబంధమని విఖ్యాతి. ఇవి నాలుగు వేదస్థానీయములుగా మన్నింపఁ బడుచున్నవి. శ్రీవైష్ణవు

I Present Mylapore.
II ,, Mahabalipuram.
* See 'History of Sanskrit Literature' of Dr. M. K. Acharya. P. 277.
† See 'Alwar Saints' P. 5.

లందఱును పరమపవిత్రములైన యీ దివ్య ప్రబంధములు భక్తిమై పఠింతురు. ఈద్రావిడ వేదము సంస్కృత వేదము అను రెండు వేదములను ప్రమాణముగాఁగొని ప్రవర్తించుటచేతనే శ్రీవైష్ణవులకు ఉభయవేదాన్త ప్రవర్తకులను పేరు వచ్చినది.

## కులశేఖరాళ్వారుల చరిత్ర.

మహనీయచరితులగు నాళ్వారులలో శ్రీ కులశేఖరాళ్వారొకరు. ఈ ఆళ్వారులు కేరళదేశాధీశుఁడును చేరవంశమండనుఁడునగు దృఢవ్రతుఁడను రాజశేఖరుని పుత్త్రులు. వీరిది కోళిపట్టణము. ఇదియే నేఁడు 'క్విలన్' (Quilon) దీనినే సంస్కృతీకరించి గరుడవాహన పండితుఁడు తన దివ్యసూరి చరితమున 'కుక్కుట కూట' పట్టణమని వ్యవహరించెను. ♦ శ్రీ వేదాంత దేశికులవారు తమ ప్రబంధసార గ్రంథమున ఎనిమిదవ పాశురములో స్పష్టముగ, 'కులశేఖరులు వంజికులం అను చోట ఉదయించి'రని చెప్పిరి. మఱి! ఇప్పుడు కులశేఖరు లుదయించిన పట్టణము కోళిపట్టణమా? వంజికులమా? అను సందియము గలిగినది. దీనిని ఎన్. కృష్ణస్వామి అయ్యంగార్ ఇట్లు సమన్వయపఱచిరి. "కులశేఖరులు వంజికులములో (ఇప్పటి కొచ్చిన్ సంస్థానములో నొక పట్టణము) ఆవిర్భవించిరి. కొల్లి వీరి నివాసమైయుండెను."

కులశేఖరులు శ్రీమన్నారాయణుని కౌస్తుభాంశమున నవతరించిరని సంప్రదాయ గ్రంథములు వాకొనుచున్నవి. సర్వేశ్వరుని హృదయ సన్నిహితమైన దివ్యాభరణమగుటచేతనే కాఁబోలు ఈ భక్తాగ్రేసరుఁడు

---

♦ (1) చూ. 'దివ్యసూరిచరితమ్' పు. ౨౬

(2) కులశేఖరుల తిరునక్షత్ర 'తనియ' లోను 'కేరళే కోళిపత్తనే' అనియే యున్నది. ఈ పట్టణమునకు ౧. కోళిపట్టణం ౨. కొల్లి నగరం 3. కుక్కుటకూటము ౪. కుక్కుటపురము ౫. కోళకూరు అనియు పేళ్లు.

(3) దీనినిఁబట్టియే కులశేఖరులకు ౧. కొల్లిక్కావలన్ ౨. కుక్కుట పురాధీశర్ 3. కోళియర్కోన్ అను పేళ్ళును గలిగినవి.

తాను భగవంతునకును తనకు భగవంతుఁడును భోగ్యభూషణములుగాఁగ వెలుఁగొందెను. ♦

## కులశేఖరుల కాలము

సంప్రదాయమును బట్టి కులశేఖరులు కలియుగారంభమున ౨౮ వ పరాభవ సంవత్సర మాఘ శుద్ధ ద్వాదశీ గురువారము ప్రీతి నామ యోగము, పునర్వసు నక్షత్రమున నవతరించిరని తెలియు చున్నది. ✽ అనఁగా క్రీ. పూ. 3075 లో ఇప్పటికి దాదాపు అయిదు వేల సంవత్సరములనాఁడు శ్రీ కులశేఖరు లుదయించియుండిరని తేలి నది. చారిత్రికుల దృష్టిలో ఇది చాల ప్రాచీనకాలము. ఇంచు మించు వైదిక వాఙ్మయ ముదయించినకాలము. రామాయణ భారతాదులను రచించిన వాల్మీకి వ్యాసమహర్షులకంటె కులశేఖరులు పూర్వులు గావలసి వత్తురు. రామాయణమును భక్తిమై శ్రవణానందముగ పురాణ కాలక్షేప ములు చేసిన శ్రీ కులశేఖరులు ఆయాది కావ్యమునకుఁ బూర్వమేయుండి తమ ముకుందమాలను రచించిరనుటనే యైతిహాసికుఁ డంగీకరించి యూర కుండును? కావుననే కులశేఖరుల కాలచర్చ యొక జటిల సమస్యయై చాలమందికిఁ ఒని గల్పించినది. కొందఱు యీ యాళ్వారు క్రీ. శ. 6 శతాబ్దిలో నుండెననిరి. మఱికొందఱు 7 వ శతాబ్దమనిరి. కొందరు 9 వ శతాబ్దమనగాఁ మఱికొందఱు 12వ శతాబ్దమనిరి. ఇట్లు ఎవరికిఁదోఁచిన నిర్ణయమును వారు చేసిరి. ఈ వాదములోఁ బొల్గొన్న వారందఱిలో ఆళ్వారులను అత్యంతము అర్వాచీనులనుగా నిరూపించినది. సుప్రసిద్ధుఁడగు శ్రీ సర్. ఆర్. జి. భండార్కర్ మహాశయుఁడు. ఈ పండితుఁడు ఆళ్వారు లందఱను క్రీ. శ. ౬ నుండి ౧౨ వఱకు గల మధ్యకాలములో నున్న వారినిఁగా నిర్ణయించెను. ఈ వాదమును ఐతిహాసికులలో, అందునను

---

♦ ప్రళయకాలమున జీవులందఱు కౌస్తుభమున అణగియుందురు. అట్లు జీవశరణ్యామైన కౌంస్తుభాంశమున రాజై యుదయించుట ప్రజలను రక్షించుటకేగాక ప్రజలను ఉజ్జీవింపఁజేయుటకును నని టీకాకర్తల కుమారులగు శ్రీ వేంకటాచార్యులవారు వ్యాఖ్యానించిరి.

✽ 'కుంభే పునర్వసౌజాతం కేరళే కోళిపట్టనే
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే.'

దక్షిణ భారత చరిత్రలో ప్రామాణికుఁడగు శ్రీ డా. యస్. కృష్ణస్వామి అయ్యంగార్ ఎం.ఏ., యుక్తియుక్తముగ ఖండించి గురుపరంపరా ప్రభావాది సంప్రదాయ గ్రంథములు వాకొను కలియుగారంభవాదము నంగీకరింపకపోయినను; ఆళ్వారులు, భండార్కర్ అనుకొనినంత నిన్నమొన్నటి వారు మాత్రము గాదని క్రీ. శ. 3 నుండి 9 శతాబ్ద మధ్యమువఱకు వారి కాలములను నిర్ణయించుచు శ్రీ కులశేఖరులు క్రీ. శ. 6 శతాబ్దములోనో లేక 7 శతాబ్దారంభముననో యుండి యుందురని రాద్ధాంతము చేసెను.

పరిశీలింపఁగా శ్రీ కులశేఖరులు ఈ క్రీ. శ. 6-7 శతాబ్దములకంటె కూడ ప్రాచీనులనియే యనవలసివచ్చుచున్నది సంప్రదాయముగ వచ్చు కథలు, కాలము పూర్తిగ చరిత్ర కాకపోవచ్చునేగాని వట్టి బూటకములు మాత్రము కాదు గదా! ఆఱు ఏడు క్రీ. శతాబ్దములోని పెక్కు విషయములు చరిత్రకు లొంగినవే. కలియుగమునకు ఆదిలో గాకపోయినను అంత ప్రాచీనముగా ఏ మూఁడు శతాబ్ద ప్రాంతముననో ఈ యాళ్వారులున్నారని తలంపవలసియున్నది. ఈ యూహకు ఉపష్టంభకములుగాఁ గన్పడిన రెండు విషయముల నిటఁ బొందుపఱచెదను.

౧ మహాదేవేంద్ర సరస్వతి వ్రాసిన గురురత్నమాలికయను అద్వైత పరంపరాగ్రంథములో ఉజ్జ్వల శంకరులను గుఱించి వ్రాయఁబడినది అందు "కులశేఖర సాహిత్యప్రణేత్రే వలదా సేతు హిమాద్రి విజ్ఞనేత్రే" అని యుజ్జ్వల శంకరులు కులశేఖరులకు సాహిత్య శాస్త్రమును జెప్పినట్లున్నది. ఈయుజ్జ్వల శంకరులాగురుపీఠము నధిష్ఠించినవారిలో ౧౬ వ వారు ౩౨౯-౩౬౭ A. D. లో నున్నవారు. కావున కులశేఖరులు క్రీ. శ. ౩,౪ శతాబ్దముల నడుమ నుండిరని చెప్ప వీలగుచున్నది

౨ కేరళోత్పత్తియను గ్రంథమున కులశేఖరుల నిర్యాణము క్రీ. శ. 333 లో జరిగినట్లు వ్రాయఁబడియున్నది. రాజవంశమున పరంపరముగా వచ్చియుండిన యీలెక్క ప్రబల ప్రమాణములున్నగాని త్రోసి రాజనఁబడఁగూడదు. కనుక ఈరెండు ప్రమాణములతోను ఆళ్వా

---

౧. ౨. } See Dr. M. K. Acharya's History of Sanskrit literature. P. 326.

రుల ప్రాచీనత్వమునుబట్టి శ్రీకులశేఖరులు క్రీ.శ. 3వ శతాబ్దాంతమున ౪ వ శతాబ్దములో నుండిరని తేల్పవచ్చును. మఱియొక యడుగు వైచి శ్రీగణపతి శాస్త్రిగారు తమ తపతీ సంవరణ పీఠికలో ఆళ్వార్ కులశేఖరులు కలియుగ గతాబ్దములు ౧౬౮౦ కి సరియగు క్రీ. పూ. ౧౪౨౨ (1422 B. C.) లోనుండిరని వ్రాసెనట. (చూ. డా. కృష్ణమాచార్యుల సం. భా. చరిత్ర పు. 278)

శ్రీకులశేఖరుల కాలము నిర్ణయించు నీచర్చలోఁ బాల్గొన్న ఆయా విద్వాంసుల చర్చా ఫలితముల పట్టిక యిటఁజూపఁబడుచున్నది.

| ఈ విషయమును చర్చించిన విద్వాంసులు. | నిరూపితకాలము. |
|---|---|
| ౧ గురు పరంపరాది గ్రంథకర్తలు. | 3075 B. C |
| ౨ డా. యం కృష్ణమాచార్యులు M. A. M. L. M. D. | ,, |
| 3 చింతలపల్లి వెం॥ సుబ్రహ్మణ్యము. తమిళవిద్వాన్. | ,, |
| ౪ పి. కృష్ణమూర్తి. | ,, |
| ౫ గణపతిశాస్త్రి ? | 1422 B. C. |
| ౬ మహాదేవేంద్ర సరస్వతి | 329-367 A. D. |
| ౭ కేరళోత్పత్తి కారులు. | 333 ,, |
| ౮ డా. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ M. A. | 6 శతాబ్దము A. D. |
| ౯ అమరవాది హనుమచ్ఛాస్త్రి M. A | 780-890 ,, |
| ౧౦ కె. ఆర్. పిషారటి | 8-9 శతాబ్ద ,, |

---

౨ "సంస్కృత వాఙ్మయచరిత్ర"

3 "ఆళ్వారులు" అను తమిళవ్యాసము.

౪ "కులశేఖరుఁడు" అను తెలుఁగువ్యాసము. 1930 భారతి. ప్రమోదూత మార్గశీర్షము.

౫ "తపతీసంవరణపీఠిక" తిరువాన్కూరు సంస్కృత గ్రంథమాల.

౬ "గురురత్నమాలిక" అను సంస్కృత గ్రంథము.

౭ తిరువాన్కూర్ స్టేట్ మాన్యుయల్ I. 223.

౮. Early History of Vaishnavism, 1920.

౯ "ద్రావిడ వాఙ్మయము తిరుపతి వేంకటేశ్వరుల ప్రశంస" ౧౯3౧ భారతి.

౧౧ ఎ. ఎస్. రామనాథ అయ్యంగార్ 9 శతాబ్దము
౧౨ మల్లాది సూర్యనారాయణశాస్త్రి 935-955 A.D.
౧3 సర్. ఆర్. జి. భండార్కర్. 12 శతాబ్దము
౧౪ బిషప్ కాల్డువెల్ ,,
౧౫ ప్రొఫెసర్ యం. శేషగిరిరావు ,,

## కులశేఖరులు—భాగవతనిష్ఠ

వీరు గొప్ప రాజ్యమున కధీశ్వరులైనను జనకాదులవలె మహా వైరాగ్య సంపన్నులై యెల్లప్పుడును భాగవత సేవయే పరమనిష్ఠగా నెంచుకొని తమ రాజ్యమును రామరాజ్యముచేసి పాలించుచుండిరి. అవతారములలో శ్రీరామ, కృష్ణులయందును, అర్చావతారములలో శ్రీరంగనాయక వేంకటేశ్వరులయందును వారెక్కువ మక్కువం జూపుచుండిరి. శ్రీవైష్ణవుల యెడ వారు సాక్షాద్విష్ణు తాత్పర్యమునే గలిగియుండిరి. నిత్యము శ్రీవైష్ణవుల గోష్ఠి భగవత్కథాశ్రవణము తద్గుణకీర్తనము జరుగుచుండెను.

ప్రజా కార్యముల నరయవలసిన రాజు అట్లు సంతత శ్రీవైష్ణవ గోష్ఠులలోఁ బ్రొద్దుపుచ్చుట మంత్రులకు గిట్టినది కాదు. దినదినము ప్రవర్ధమానమై దృఢమగుచున్న యేని వైష్ణవ భక్తిని జూచి మంత్రులు సహింపలేకపోయిరి. ఎట్లైనను శ్రీవైష్ణవులయెడ ద్వేషము గల్పించినగాని రాజు రాచపనులు సరిగఁ జూడఁడని వారొక యుక్తినిఁజేసిరి. రాజాంతఃపురములోని యొక యనర్ఘరత్నమును వారు మాయము చేసిరి. రత్నము దొంగిలింపఁబడినదని రాజునకు దెలిసెను. దొంగను బట్టుకొనుటకు గట్టి కట్టడులు చేయఁబడెను. ఎక్కడ వెదకినను, ఎంత ప్రయత్నించినను

---

౧౦. Royal Asiatic society journal 1925
'Authorship of Nalodaya'
౧౧. సంస్కృత వాఙ్మయ చరిత్ర.
౧౨. Vishnavism, Saivism and minor Religions.
౧3. } ఆళ్వారులందరు శ్రీరామానుజాచార్యులవారి తరువాత వారే
౧౪. } యనియు వారిదాసులనియు వాదించి వీరిద్దఱును అపహాస్యము పాలైరి.
See 'Early History of Vaisnavism' PP. 4 & 5,

రత్నము దొరకలేదు. ఆ రత్నమును రాజుగారి నగరులోనికి నిరాటంక ముగా వచ్చి పోవువారే దొంగిలించియుండవలెను. దాస దాసీల యిండ్లు వాకిండ్లు గాలింపఁబడినవి. రత్నము దొరకలేదు. ఇకఁ రత్నమును దీసిన వారెవరు? ఆ రత్నము రాజుగారి యింటి యర్చామూర్తికి ఆభరణ మగుటచే రాజుగారికి దానియందెక్కువ యాదరము. ఎట్లైనను దానిని సాధించి తీరవలెనని శ్రీకులశేఖరులు మంత్రుల కాజ్ఞయిచ్చిరి. ఇదియే యదనని మంత్రులు శ్రీవైష్ణవులే యీచౌర్యమును జేసియుందురనియు, ఒరులు ఆ పూజాగృహములోనికి రారనియు వారినిఁ బరీక్షించి శిక్షించిన గాని రత్నము లభింపదనియు, వీరందఱును వీతరాగులవలె గన్పడుదురే గాని యదియంతయు గేవలము నటనమే యనియు రాజునకు నూరిపోసిరి. భాగవతులట్లు కార్యమును జేయరని యానిష్ఠానిధి యనెను. వారు గాక మఱియొక రెవ్వరును ఈ దొంగతనమును జేయలేదని మంత్రులు వాదిం చిరి. భాగవత దూషణము నాభక్తాగ్రేసరుఁడు విని సహింపలేకపోయెను. పట్టుదల హెచ్చెను. ఎలుగెత్తి యా భాగవతాగ్రగణ్యుఁడిట్లనెను. 'భాగ వతులు నిర్దోషులని నే మహాదరగము నంటిచెప్పెదను. తే తెండు! రాజాజ్ఞ! వెంటనే కాలసర్పమును అహితుండికుఁడు గొనివచ్చి పేరోల గమున జేనియెదుటఁ బెట్టెను. ఆ భయంకర సర్పము విషరోచులెసగ బుసగొట్టుచుండెను. 'భాగవతులు నిర్దోషులని నేనీ యహిశిరమునఁ గేలు వెట్టి ప్రమాణము చేయుచున్నాను.' వారు దోషులైనచో నన్నిది కఱచి చంపును గాక! యని యా భక్తశేఖరుఁడు అహికరండమును దెఱపించి భీషణమైన యా కాలసర్పము పడఁగపైఁ జేయివెట్టెను. ఆశ్చర్యము. ఆ కాలసర్పము కృష్ణ తులసీదామమువలె ఆ భక్తవరుని చేతినిఁ జుట్టు కొనెను. ఆ పవిత్ర భాగవత హస్త స్పర్శమువలన గలిగిన యానంద పారవశ్యముచే నాట్యముచేసెను. మంత్రులు సిగ్గిలి మోసమునివినిచి క్షమింపవేడిరి. భాగవతులు నిర్దోషులని నిర్ణయింపఁబడెను. భక్త కుల శేఖరులు విజయమునొందిరి.

### కులశేఖరులు-మహాభక్తులు.

ఇట్టి యద్భుత ఘట్టములు మఱికొన్నియు నీభక్తాగ్రేసరుని జీవిత ములో జరిగినవి. అవియన్నియు అచంచలము సంపూర్ణమునైన వారి భక్తికి నిదర్శనములు. ప్రతిదినము రామాయణ కాలక్షేపమును వారు

చేయుచుందురు. మైమఱచి యారామకథా సుధారసము గోలుచుం దురు. ఒకనాడు పౌరాణికుఁడు శ్రీమద్రామాయణమున అరణ్య కాండ మును జదువుచుండెను. తన్మయులై కులశేఖరులు వినుచుండిరి. అది ఖరదూషణాది పదునాల్గువేల భయంకర రాక్షసులు శ్రీరామచంద్రు నెదుర్కొనిన ఘట్టము. ఏమగునో యనియట మహర్షుల హృదయములు దల్లడిల్లుచున్నవి. ఇట యీ భక్తాగ్రేసరుని హృదయము తల్లడిల్లఁ జొచ్చినది. ఇంతలో "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమ కర్మ ణామ్ । ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి? అని పౌరా ణికుఁడు జదివెను. తద్భావ భావితాంతఃకరణులగు కులశేఖరులకా ఘట్టమంతయుఁ గనులకు గట్టినట్లయ్యెను. తాను మనమార ప్రేమించు రామచంద్రునికేమి యగునో యని తత్తర పుట్టెను. తన వస్తువును తన సర్వస్వమును తాను రక్షించుకొన వలెను. శ్రీరామచంద్రునకు సాయ పడవలెను. ఒడలు గగుర్పొడువ, పెదవులదఱ, వెంటనే నా సేనల నన్ని టిని యుద్ధమున కాయత్తము సేయుడు! సేయుఁడు! అని సేనానులకాజ్ఞ లిచ్చుచు లేచి ముందుకు సాగబోయెను. పౌరాణికు డింతలో గ్రంథము నందుకొని,

" తందృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహం
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"

( శ్రీరామచంద్రుడు శత్రువులనెల్ల మట్టు బెట్టి విజయమునొంది మహర్షులఁ గాపాడిరాగా సంతోషాతిశయమున సీతాదేవి కౌగిలించు కొనెను) అని చదువ ఆభగవద్విజయము విని భక్తుని హృదయావేగము శాంతించెను. సేనలు మరలెను.

సీతాపహరణ ఘట్టములోను నిట్లే జరిగెను. "ఇదిగో! దుష్టునిశిక్షిం చి మాతల్లి చెర విడిపింతునని సేనలతో రావణుని లంకపైకి దండెత్తి యడ్డమువచ్చిన సముద్రములోఁగూడ దిగిపోవుచుండ శ్రీరామచంద్రుఁడే సీతాదేవితోఁగూడ ఆభక్తునకు ఎదురువచ్చి దర్శనమిచ్చెను. తల్లి చెఱ విడినదని దృఢపడ ఆభక్తాగ్రేసరుఁడు తిరిగి వచ్చెను. ఇది నవవిధ భక్తు లలో శ్రవణ మను భక్తి.

శ్రీరంగనాథుఁడు తన కిష్టదైవమగు శ్రీరామచంద్రునిచేఁగూడ నారాధింపఁ బడెననియు ఇక్ష్వాకు వంశీయులకెల్ల ఆరంగనాథుఁడే యిలు

వేల్పునియు విని అత్యంతము హృష్టుండై యారంగనాథు నెప్పుడు సేవింతమా! యని యువ్విళ్ళూరుచు ప్రతిదినము శ్రీరంగయాత్రకై ప్రయాణమగుచుండెను. భక్తులందఱు భగవద్దర్శనము చేసికొన నభిలాషగల వారలందఱును రావలసినదని రాజుగారి శ్రీరంగయాత్ర పురవీధులలో చాటింపఁ బడుటయు ఇంతలో నెక్కడినుండియో కొందఱు భాగవతులు వేంచేయుటయు వారి పరిచర్యాగోష్ఠులతోనే యానాడు గడచి పోవుటయు తిరిగి మఱునాడట్లె రాజుగారి శ్రీరంగయాత్ర పురమున ఘోషింపబడుటయు ప్రయాణ సమయమునకు శ్రీవైష్ణవులు వేంచేయుటయు తత్సపర్యలతో ప్రయాణము నిలుచుటయు జరుగుచుండెను. ఇట్లే ప్రతిదినము జరుగుచుండెను. కావుననే యొకభక్తులు శ్రీకులశేఖరులను స్తుతించుచు,

"ఘుష్యతే యస్యనగరే రంగయాత్రాదినేదినే
తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్"

అని యీయితిహాస సూచకముగా స్తుతించిరి. "తదారాధనాత్పరం తదీయారాధనమ్" అను ప్రపన్న సిద్ధాంతమునందెంత భద్ధశ్రద్ధులో (శ్రీకులశేఖరులు) దీనివలన దెలియుచున్నది. కావుననే వారు రచించిన ముకుందమాల స్తోత్రమును ప్రారంభించుటకు ముందు భక్తులీ కులశేఖర ప్రపదనమును పఠింతురు. శ్రీ కులశేఖరులకు ఒక కుమారుడును, నీలాదేవి యంశము నుద్భవించిన ఒక కుమార్తెయు నుండిరి. ఈ మహానుభావుడు తన కుమార్తెను శ్రీ రంగేశ్వరునకు సమర్పించెను.

కులశేఖరప్పడి.

కులశేఖరుల భక్తి యేడుకొండల దేవుని సేవింపగనే యొక్కసారిగా కట్టలు తెగి వఱ్ఱోడినది. హృదయ స్పృక్కులైన ముక్కల వంటి పాశురములతోఁ ప్రార్థించుచు నీభక్తాగ్రగణ్యు డిట్లనుచున్నాఁడు. 'ఓ వేంకటాచలపతీ! నాకు ఈరాజ్యమేకాదు; స్వర్గరాజ్యమిచ్చినను వలదు. తండ్రీ! నీ యీ బంగారు కొండపై నుండనిచ్చినఁజాలును. నీపాద పద్మములవఱకు భక్తులను జేర్పించు ఈ మెట్లు వరుసగా నన్నుండనీయరాదా! నీ తులసితోటకును, పూలతోటకును, నీరు పాఱు నొక కాలువగా నన్ను బుట్టింపలేకపోయితివా! నీ సుందర మందిరమున నన్నొక స్తంభముగానైన నిల్పవా? నీ పాదయుగళిపై నర్పింపఁబడనోచు పూలు పూయు ఆ చంపకపు మొక్కలలో నొక మొక్కగాఁ జేయరాదా?

అదిగో! ఆ స్వామి పుష్కరిణిలోఁ దళుకుతళుకున నెగురుచు నీదులాడు చేపలలో నొక చిన్న చేపపిల్లనగునట్లనుగ్రహింపరాదా! తండ్రీ! నీ గర్భమందిరమునకు గడపగా నుండ దయఁజూచిన నిచ్చట నీభక్త పాదధూళిలోనలిగి నీ పాదారవిందములు సేవించుచుందునే!' అని స్తుతించి భక్త్యావేశమున వివశులై పడిపోయిరట. (పెరుమాళ్ తిరుమొழி) నేఁటికిని తిరుపతి వేంకటేశ్వరస్వామి గర్భాలయములోని గడపకు కులశేఖరప్పడి అను వ్యవహారముగలదు. మహాభక్తులకుఁగాని యిట్టి తన్మయత గలుగదు.

కులశేఖరులట్లు కొంతకాలము జనకమహారాజువలె నిర్లిప్తులుగనే రాజ్యమేలి యీ మాత్రపు లౌకికసంబంధముగూడ నొల్లక అనురూపగుణుఁడగు కుమారునికి రాజ్యమిచ్చి తాము శ్రీరంగము, తిరుమల మున్నగుదివ్యదేశముల కేగి పెన్నిధినిగన్న పేదచందంబున భక్త్యావేశముతో (ద్రావిడభాషలో ముప్పదిపాశురములతో శ్రీరంగనాథుని డెబ్బది యేడు పాశురములతో శ్రీ వేంకటేశ్వరుని శ్రీకృష్ణుని శ్రీరామచంద్రుని స్తోత్రము చేసిరి. సంస్కృతభాషలోను అమృతములొలుకు పద్యప్రసూనములతో మాలగట్టి భగవత్కంఠసీమ నలంకరించి తరించిరి. ఈ శ్రీకులశేఖరుల ద్రావిడస్తోత్రమే 'పెరుమాళ్ తిరుమొழி' అను తిరునామముతో భాగవతవిజ్ఞాన రత్నకోశమగు నాలాయిరములో విరాజిల్లుచున్నది. శ్రీ కులశేఖరాళ్వారు రచించిన సంస్కృతస్తోత్రమే ప్రకృతమగు ముకుందమాల.

### * ముకుందమాల - శ్రీకృష్ణస్తోత్రము.

మొదటిపద్యమున ముకుంద! అని సంబోధించి చేసినస్తోత్రమాల గావున దీనికి 'ముకుందమాల' యను వ్యవహారము గలిగియుండును. మఱియు ఈ స్తోత్రమున విష్ణు పర్యాయములగు శ్రీ వల్లభనారాయణాది పదములు యథేష్టముగాఁ బ్రయోగింపఁబడినను చాల పద్యములలో ముఖ్య సంబోధనము ముకుందపదముతోనే గన్పడుటయు దీనికీ పేరువచ్చుటకుఁ గారణమైయుండును. మన దక్షిణభారత ప్రతులలో లభింపలేదు

* ముకుందశబ్ద నిర్వచనము:- ముకుమ్ దదాతీతి ముకుందః= మోక్షమునిచ్చువాఁడు 'ముకుంభక్తిరసప్రేమ వచనం వేదసమ్మతం యస్తద్దదాతి భక్తేభ్యో ముకుందస్తేన కీర్తితః' బ్రహ్మవైకర్తము.

గాని, ఉత్తరదేశ పాఠముననున్న యొకపద్యమున స్పష్టముగా స్తుతి కర్తయే ఫలశ్రుతిరూపముగా జెప్పినపద్యమున 'ముకుందమాల' అని పేర్కొనెను. † ఇది ముఖ్యముగా శ్రీకృష్ణస్తోత్రము. అవతారములలో ఏ యితరావతారమును సూచించుపదము నిందొక్కటికూడ ప్రయోగింపఁ బడకుండుటయు, ప్రధానముగ భగవంతుని సంబోధింపవలసివచ్చినపుడెల్ల ముకుంద, కృష్ణయనుపదములను, కృష్ణావతారమును బేర్కొను గోపాల! కంసాంతక! గోపీజననాథ! దేవకీనందన! వృష్ణివంశప్రదీప! మొదలగు పదములను మాత్రమే ప్రయోగించుటయు గమనింపదగినది. శ్రీకృష్ణ మన్త్రం, కృష్ణరసాయనం, శ్రీకృష్ణదివ్యౌషదం అమృతం కృష్ణాఖ్యం' అని యీ స్తోత్రము కృష్ణపదభూషితమగుటకు శ్రీ కులశేఖరయోగిపై నెరపిన యోగీశ్వరుని గీతాపరిభావమే కారణమని తెల్లమగుచున్నది. యమకానుప్రాస సార్వవిభక్తికముల రూపకాపహ్నవకావ్య లింగాదులునను శబ్దార్థాలంకారశోభితమై ప్రసాదమాధుర్యగుణాన్వితమై దాంతరసము తొనికిసలాడు నీ ముకుందమాల చక్కని కావ్యరత్నమాలిక నా నింపెసలారు చున్నది.

## ముకుందమాల - శ్రీకులశేఖరుల సందేశము.

భక్తాగ్రగణ్యుల శ్రీసూక్తులు ఉపనిషత్సారములు ముకుందమాల లోని యొక్కొకపద్యమును మానవకల్యాణమునకు హేతువగు నొక్కొక్క మహోపదేశమును జేయుచున్నది. ముకుందమాలారూపమున శ్రీ ఆళ్వార్ సందేశమిది:—

౧. భగవన్నామస్మరణముచేయుము. ౧,౨౨,౩౭,౩౮,౩౯
౨. అవిచ్ఛిన్నమైన భగవద్భక్తి గలిగియుండుము. ౪,౬,౭,౯,౧౨,౨౧
౩. అల్పుఁడగు నరుని యాచింపకుము; సర్వేశ్వరుని యాచింపుము. ౨౯
౪. కామాదులను దరిసేరనీయకుము. ౩౦
౫. పరమౌషధము, పరమమంత్రము, పరమహితము భగవన్నామము; దానిని జపింపుము. ౧౮,౧౯,౨౫, ౨౪,౩౨
౬. అనన్యభక్తితో నారాయణునొక్కనినే శరణువేడుము. ఆతఁడే సర్వశ్రేష్ఠుఁడు. ౧౩,౧౪,౨౦,౩౫

† చూ. ఈప్రతి ౩ వ పు. చూ. వాచస్పత్యము 4755 వ పుట.

## ముకుందమాల - అనుకృతులు.

లలిత లలితపదములతో మనోహరమై యుత్తమభక్తుని హృదయమున సహజముగఁ గలుగుభావనలే వెలయ దేశమునందెల్లెడ మిక్కిలి ప్రచారములోనికివచ్చినట్టియు ప్రాచీనమైనట్టియు నీ ముకుందమాలలో నుండి కొన్నిపద్యములతీసికొని కొందఱు కవులు తమతమ కృతులలో బంగారునగపై రత్నములుదాపినట్లుగఁ జేర్చుకొనిరి. ఉత్తమము, స్వీకార్యము, అయినవస్తువును గౌరవించి గ్రహించుట కవులకాచారమే. రామాయణములోని ఎన్ని మధురఘట్టములను పదములకుఁ బదములతోఁ బాటు కాళిదాసు గ్రహింపలేదు! కాళిదాసు అశ్వఘోషులయు, కాళిదాస అనుభాసులయు కావ్యానుకరణభావము పరిశీలకు లెఱింగినదేకదా! ఇట్టియెడ జగన్మాన్యమైన ముకుందమాలనుండి యొరులు కొన్ని పద్యములు గ్రహించుట వింతకాదు. అట్లు ముకుందమాలనుండి పద్యములకు పద్యములనే గ్రహించినవి శ్రీకృష్ణ కర్ణామృతము; పాండవగీత యనునవి. కొంచెము మార్పుతో గ్రహించినది శ్రీరామకర్ణామృతము. ఈమూఁడు గ్రంథములు ముకుందమాలకంటె మిక్కిలి యర్వాచీనములనియే వాఙ్మయచరిత్రకారుల సిద్ధాంతము ♦

| | గ్రంథము | కవి | కాలము |
|---|---|---|---|
| ♦ ౧ | శ్రీకృష్ణ కర్ణామృతము | లీలాశుకకవి లేక బిళ్వమంగళుడు | |
| ౨ | శ్రీరామ కర్ణామృతము | రామభద్ర దీక్షితుఁడు | |
| 3 | ,, | ప్రతాపసింహుఁడు | |
| ౪ | పాండవగీత | శంకరయామునాచార్యాది స్తోత్రములనుండియు, భాగవతమునుండియు, పురాణములనుండియు శ్లోకములను తీసికొని లోమహర్షణ, దుర్యోధన, ద్రుపదాదులు చెప్పినట్లు నేర్పాటుచేసిన యొక సంకలన గ్రంథము. | మిక్కిలి యర్వాచీనము |

ఉన్నవి యున్నట్లుగా గ్రహింపఁబడిన పద్యములు.

| ముకుందమాల | | | శ్రీకృష్ణ కర్ణామృతము | పాండవ గీత |
|---|---|---|---|---|
| నమామి నారాయణ | ౩౫ | × | | లోమహార్షణఉవాచ నమామినారాయణ |
| జయతు జయతు దేవో | ౨ | × | | —జయతిజయతి దేవో |
| కృష్ణత్వదీయపద | ౭ | × | | —అవిర్హోత్రఉవాచ కృష్ణత్వదీయ |
| మజ్జన్మనః ఫలమిదం | ౨౭ | × | | కృపాచార్యఉవాచ మజ్జన్మనః ఫల |
| హేగోపాలక | ౨౧ | × | ౨ ఆ. ౧౦ వ ప. | |
| భవజలధిగతానాం | ౧౨ | × | సుభాషితావళి (క్షేమేంద్రుని దని వల్లభ దేవుఁడు) | |

కొంచెము మార్పుతో గ్రహింపఁబడిన పద్యములు.

| ముకుందమాల | | | శ్రీరామకర్ణామృతము. |
|---|---|---|---|
| శ్రీవల్లభేతి | ౧ | × | శ్రీరామచంద్రేతి...(తక్కినది సమానము) |
| శత్రుచ్ఛేదైక...లో శ్రీకృష్ణమంత్రం... | | × | శ్రీరామమంత్రమ్ ౩. ఆ. ౧౦౦ ప. |
| వ్యామోహప్రశమౌషధం...లో శ్రీకృష్ణదివ్యౌషధం | ౨౪ | × | శ్రీరామ దివ్యౌషధమ్ ౧ ఆ. ౮౪ప. |
| ఇదంశరీరం...లో కృష్ణరసాయనంపిబ | ౩౧ | × | రామరసాయనంపిబ ౪ ఆ. ౪౧ ప. |

---

'చిత్తంనైవ నివర్తతే క్షణమపి శ్రీకృష్ణపాదాంబుజాత్. (ఈ ప్రతి ౩౬ పుట) ఇత్యాదిగాగల శ్లోకము భాగవతములోనిది. ఇది ముకుంద మాలలో గనఁబడుచుండుటయు ముకుందమాల అర్వాచీనమనుటకు ఒక కారణముగా సర్. ఆర్. జి. భండార్కర్ చెప్పి ముకుందమాలా కర్త భాగవతమునుండి ఈ పద్యమును సంగ్రహించెనని వాదించెను.

దక్షిణదేశపు ప్రతులలో ఈ పద్యము లేనేలేదు కావున ఈ పర

## ముకుందమాల పద్యసంఖ్య—ప్రక్షిప్తశ్లోకములు.

ఆంధ్ర ద్రావిడ దక్షిణదేశ పాఠమున ముకుందమాలలో సామాన్యముగా 'ఘుష్యతే యస్యనగరే...' అను కులశేఖరులను గూర్చిన పద్యముగాక శ్రీవల్లభేతి... మొదలుకొని 'యస్యప్రియా' అను కడపటి శ్లోకముతోఁ గలిసి మొత్తము నలుఁబది శ్లోకములు గనఁబడుచున్నవి. దక్షిణదేశపు ముకుందమాల శ్రీవల్లభేతి వరదేతి... అని ప్రారంభింపఁబడుచుండఁగా తమ ప్రతియే విశుద్ధమైన ప్రతియను కావ్యమాల వారి ప్రతి.

వన్దే ముకున్ద మరవిన్ద దలాయతాక్షం
కున్దేన్దు శఙ్ఖదశనం శిశుగోపవేషమ్
ఇన్ద్రాది దేవగణ వన్దిత పాదపీఠం
బృన్దావనాలయ మహం వసుదేవసూనుమ్'

అను పద్యముతోఁ బ్రారంభించినది. కావ్యమాలవారి ప్రతిలో మొత్తము 38 పద్యములు మాత్రమే గలవు. వీనిలో మనదేశపు ప్రతులలో లేనివి క్రొత్తవి ౮ గలవు.

'శ్రీముకున్ద పదామ్భోజ మధునః పరమాద్భుతమ్
యత్పాయినో న ముహ్యన్తి ముహ్యన్తి యదపాయినః'

ఈ రీతిగా నీ పద్యములు హృద్యములుగానున్నవి. మన దేశ పాఠములో సుప్రసిద్ధమైన 'భవజలధి గతానాం ..' ౧౩ పద్యము ప్రక్షిప్తమని కావ్యమాలవారనిరి. దక్షిణదేశపు ప్రతిలో నున్న చాల శ్లోకములు కావ్యమాలవారి ప్రతిలో లేవు. † తమ ప్రతిలో లేనివన్నియు ప్రక్షిప్తములని కావ్యమాలవారనుట యసమంజసముగా నున్నది. ముకుందమాల రచింపఁబడిన దక్షిణదేశమునందలి పాఠము అపపాఠమనుటకును, తమ పాఠమే శుద్ధమనుటకును వినిగమకము లేనప్పుడు కావ్యమాల పాఠమే సరిగాదనుటయే యుక్తిసహము. ఏ గ్రంథము ఏ దేశమున నుద్భవించునో యా దేశములోనే యాగ్రంథ నిజస్వరూపము లభించునుగదా!

---

పద్య స్వీకరణము కులశేఖరుల కంటకసీయు, దానితోనే వారు అర్వాచీనులను వాదము ఎరిగిపోయినదనియు శ్రీ యస్. కృష్ణస్వామి అయ్యంగార్ వచించిరి.

† చూ. కావ్యమాల ద్వితీయ గుచ్ఛము పు. 11. 1893.

## టీకారచయితలు.

భారతదేశమునందలి మేటి శ్రీవైష్ణవ కుటుంబములలో శ్రేష్ఠమై 28 సింహాసనములలో మొదటిదై అసమానప్రతిభతోను, అపారపాండిత్యముతోను వివిధ రాజాస్థానములలో విద్వత్పదవుల నలంకరించి ఔకు, సురపురము, ఆత్మకూరు, మొదలగు సంస్థానములలో రాజగురు గౌరవము లందినది తిరుమల బుక్కపట్టణవంశము. అట్టి ప్రసిద్ధవంశమున నుద్భవించి బహుభాషాకోవిదులును, బహుగ్రంథకర్తలునై పండిత ప్రకాండులని వాసిగాంచిన 'బాలసరస్వతి' తర్కతీర్థ శ్రీనివాసాచార్యులవారే మొట్టమొదటి పర్యాయముగా ముకుందమాలకు లోకహితార్థము ఆంధ్రభాషలో టీకాతాత్పర్యములు వ్రాసినవారు. చంద్రికా ఖండనమను పర్యాయనామముగల తత్త్వమార్తాండము మున్నగు తొంబదియారు గ్రంథములనురచించి అభినవ నిగమాన్త మహాదేశికులని ప్రసిద్ధినొందిన శ్రీనివాసాచార్యులవారు వీరికి మూలపురుషులు. ఈ మూలపురుషుల పితామహులగు అణ్ణయాచార్య వేంకటదీక్షితులవారును సిద్ధాన్తవైజయన్తీ సిద్ధాన్తరత్నావళీలను గ్రంథములు రచించి ప్రసిద్ధిగన్నవారు. వీరి పరంపర మహార్య, కురుకేశ, శ్రీశైలపూర్ణ (తిరుమలనంబి) యామునాచార్య (ఆళవందార్) నాథముని పర్యంతము సంబంధించినది. ఇట్టి మహనీయవంశమున నుద్భవించిన మన టీకాకర్తలు బాల్యముననే తమ తండ్రిగారగు అమరచింత (ఆత్మకూరు) సంస్థాన మహావిద్వాంసులు అయిన శ్రీ బుచ్చి వేంకటాచార్యస్వామివారికడ సాహిత్య, వ్యాకరణ, జ్యోతిశ్శాస్త్రముల నభ్యసించిరి. పిమ్మట మైసూరు పురమున పరమహంసేత్యాది...షట్తంత్ర పారావార పారీణులైన శ్రీరంగనాథ బ్రహ్మతంత్ర పరకాలస్వామివారి సన్నిధిన న్యాయవేదాన్తశాస్త్రములను, సాహిత్యచక్రవర్తి శ్రీ సజ్జయం తాతాచార్యులవారియొద్ద ప్రాకృతాది షడ్భాషలను నభ్యసించిరి. తరువాత కాశీకివెళ్ళి బ్రహ్మశ్రీ సీతారామశాస్త్రులవారియొద్ద అద్వైతవేదాన్తము, సాంఖ్యయోగములను, కైలాసచంద్ర శిరోమణి భట్టాచార్యులవారికడ జాగదీశగ్రంథములను, వాని కోడపత్త్రములను నభ్యసించిరి. తొమ్మిదియేండ్ల ప్రాయముననే యలవడిన కవితాశక్తి దినదిన ప్రవర్ధమానమై వీరిని ఘంటాశత గ్రంథనిర్మాణదక్షుల నొనర్చినది. 1

1 ఈ వంశమున నుదయించి పరశ్శతగ్రంథకర్తలై గొప్ప శాస్త్రసేవగావిం

## వీరు రచించిన సంస్కృత కృతులు.

౧. తత్త్వమార్తాండ ప్రభామండలమ్ (వేదాన్తము) ముద్రితము
౨. దుర్విగ్రహ నిగ్రహము (తర్కము) అముద్రితము
౩. కిరీటి వెంకటాచార్య విజయవైజయన్తీ (నాటకము) ,,
౪. నంజరాజపరిణయము (చంపుకావ్యము) ,,
౫. సముద్రమథనము (ఘంటాశతకమ్)౧౯౦౩ మద్రాసుసభ ముద్రితము
౬. దమయన్తీ స్వయంవరము(ఘంటాశతకము)౧౮౯౧బళ్ళారిసభ ,,
౭. వజ్రనాభచరితము ( ,, ) ప్రొద్దుటూరుసభ ,,
౮. సీతాకల్యాణము(ఘంటాశతకము)౧౯౦౫ తాడిపర్తిసభ అముద్రితము
౯. భైష్మీపరిణయము( ,, ) సురపురముసభ ,,
౧౦. ధూమశకటము ( ,, ) కడపసభ ముద్రితము

ఇవిగాక పెక్కుస్తోత్రములు సుప్రభాతములు మొదలగునవిగల స్తోత్రజాలము ముద్రితము.

## ముకుందమాలా టీకా విశేషములు.

శ్రీ ఆచార్యులవారు సర్వజనోపయోగముగా తెలుఁగులో మిక్కిలి సులభశైలిలో ఈ టీకనువ్రాసిరి. శ్లోకములకు అన్వయక్రమమున ప్రతి

---

చిన మహామేధావుల విచిత్రచరిత్ర గ్రంథ వివరణాదులతో ప్రబంధరూపమున వెలువడుటఁజేయుటకు తద్వంశీయులును, ప్రకృతము ఆత్మకూరు ఆస్థానవిద్వాంసులును,టీకాకర్తలపుత్త్రులునగు శ్రీజాతక విద్వన్మణి వేంకటాచార్యులవారు సంకల్పించుట యెంతయు ముదావహము. శ్రీ ఆచార్యులవారు తమ పూర్వులు రచించిన అముద్రితములైన గ్రంథరత్నములను శ్రద్ధతో గాపాడుచున్నారు. వీరి పూర్వులలో అణ్ణయ దీక్షితాచార్య శ్రీనివాస మహాదేశిక కిరీటి వెంకటాచార్యులవారి యద్భుతచరిత్ర నొకించుక భాగమును వ్రాసి, భావచిత్ర ప్రతిబింబములతో ఇదం ప్రథమముగా ఈ విస్మృతాంధ్ర మహామేధావుల నాంధ్రలోకమున కెఱుకపఱచి పుణ్యము గట్టుకొన్నది మిత్రులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి.ఏ.,బి.ఎల్.గారు

చూ. గోలకొండ కవులసంచిక.

పదార్థమువ్రాసి తాత్పర్యమును విశదీకరించిరి. ఆయాపట్ల సంప్రదాయార్థములను వివరించిరి. ♦

౧. శ్రీయాచార్యులవారు ఉత్తరదేశపు ముకుందమాల ప్రతిని సేకరించి దక్షిణదేశపు ప్రతితోపోల్చి ౧౫ శ్లోకములు ఉత్తరదేశపు ప్రతిలో అధికపాఠములని నిర్ణయించి గ్రంథాంతమున వేఱుగాఁజూపిరి.

౨. సామాన్యులకు వ్యాకరణదుష్టములని భ్రమగలిగించు పదములను పదవిభాగవైచిత్ర్యముతో శాస్త్రీయములుగా సమర్థించిరి.

శ్లో. ౧౧ సరసిజనయనే...లో.

మావిరమస్వచిత్త × మావిరమ స్వచిత్త, అనియు

శ్లో. ౧౨ మాభీర్మందమనో...లో

ధ్యాయస్వ నారాయణమ్ × ధ్యాయ స్వనారాయణం, అనియు

శ్లో. ౩౮ కృష్ణోరక్షతునో...లో

హేకృష్ణ రక్షస్వమాం × హేకృష్ణ రక్ష స్వమాం, అనియు

పదవిభాగముచేసిరి. పై విపూర్వక రమధాతువు, ధ్యై రక్ష ధాతువులు పరస్మైపదులు. వీనిని ఇతర టీకాకారులు స్తోత్రపాఠకులును విరమస్వ, ధ్యాయస్వ, రక్షస్వ అనియే పదచ్ఛేదమునుజేయుట శోచనీయము.

శ్రీయాచార్యులవారి టీకలో పదచ్ఛేదము, పాఠాంతరములు, అన్వయక్రమము, సంప్రదాయార్థ విశేషార్థములు ఇట్టివి పెక్కులుగలవు.

## గ్రంథ ప్రకాశకులు

తొలుత ౧౯౧౨లో ఈ టీకా తాత్పర్యములతోఁ గూడిన ముకుందమాలను కీర్తిశేషులగు సవై రాజా శ్రీరామభూపాల బలవంత్ బహదూర్ అమరచింత (ఆత్మకూరు) సంస్థానాధీశ్వరులు ప్రకటింపఁజేసిరి. ఈ సంస్థానాధీశులు మొదటినుండియు మహావిద్వాంసులను, కవీశ్వరులను పోషించుచు అనేకవిధముల భాషాసేవ గావించుచున్నారు ఈ రాజవంశ మూలపురుషులు గోపాలరావుగారు. వారు సుమారు తొమ్మిదినూర్ల యేండ్లక్రిందట తిరుమల క్షేత్రమునకుఁ జెంతనున్న చంద్రగిరినుండి వచ్చి యీ రాజ్యమును సంపాదించిరి. కావుననే యీ రాజకుటుంబమునకు శ్రీనివాసులే యిలవేల్పు. ఈ సంస్థానమందలి కురుమూర్తి పర్వతము

♦ చూ. ఈప్రతి ౧౫,౩౬,౩౭,౩౯ పుటలు.

శ్రీనివాస క్షేత్రము. పరంపరగా ఈ వంశీయులు భగవద్భాగవత కైంకర్య పరులై రాజ్యపరిపాలనము జేయుచున్నారు. కీ. శే. రాజా శ్రీరామ భూపాల బహదూర్ గారి ధర్మపత్నులును ప్రకృతము ఈ సంస్థానాధీశ్వరులు నగు సవై రాణి భాగ్యలక్ష్మమ్మ దేశాయిగారు తమ సంస్థానాధిపతులగు పూర్వులవలెనే పండితుల బోషించుచు బహువిధముల భాషాసేవఁ జేయుచున్నారు. వీరు ప్రకాశింపఁజేసిన గోలకొండకవుల సంచికయు, శాంకరభాష్య తత్త్వబోధినీ సహితమగు భగవద్గీతా ద్వితీయ కుసుమము, ప్రకృతము ప్రకటింపఁజేసిన ఈ ముకుందమాలా గ్రంథమును భాషాసేవకు నిదర్శనములు. ప్రతి సంవత్సరమును వీరి యాస్థానమున ఫాల్గుణమాసమున జరుగు విద్వత్సభా సన్మానములును వీరి విద్వత్పోషణమునకు తార్కాణము.

ఈ సంస్థానాధీశులు ప్రచురింపఁజేసిన గ్రంథములు.

సవై రాజా శ్రీసీతారామ భూపాల బలవంత్ బహదూరువారు ప్రకటింపఁజేసినవి.

| గ్రంథము | కృతికర్త |
|---|---|
| ౧ రహస్యత్రియ సారార్థసంగ్రహము | రంగనాథబ్రహ్మ తంత్రి పరకాలస్వామివారు |
| ౨ ఆశీర్వాద మంత్రార్థవాదము | ఆచార్య రాఘవాచార్యులవారు |
| 3 శ్రీనివాసవిలాసము (చంపువు) | హాసు దుర్గము కృష్ణమాచార్యులవారు. (వీరే పిమ్మట మైసూరిలోనుండు బ్రహ్మతంత్రపరకాల పీఠాధిపతులైరి.) |
| ౪ జ్ఞానరత్నప్రకాశిక | అభినవనిగమాన్తదేశిక శ్రీనివాసాచార్యులవారు. |
| ౫ షష్ఠీదర్పణము | ,, |
| ౬ హరిగుణదర్పణము | ,, |
| ౭ హయగ్రీవ దండకము | కిరీటి వెంకటాచార్యులవారు |
| ౮ దశావతారస్తోత్రము | ,, |

౯ శ్రీనివాస పంచాశత్ మొ॥ స్తోత్ర జాలము    బాలసరస్వతి శ్రీనివాసాచార్యులవారు.

౧౦ హయలక్షణవిలాసము (తెలుగు)    సంకలయిత    ,,

౧౧ చెంచునాటకయక్షగానము(తెలుగు) తిరుమల (రెడ్డి) రావు

సవై రాజా శ్రీ రాజా శ్రీరామభూపాల బలవంత్ బహదూర్ వారు ప్రకటింపఁజేసినవి.

౧ తత్త్వమార్తాండప్రభామండలము బాలసరస్వతిశ్రీనివాసాచార్యులవారు

౨ ముకుందమాల టీక (౧౯౧౨)    ,,

౩ పూజావిధానము    ,,

౪ పంచాయుధస్తోత్రము టీక    ,,

ప్రకృతము అమరచింత సంస్థాన రాజ్య పరిపాలనముచేయుచున్న సవై రాణి భాగ్యలక్ష్మమ్మ దేశాయిగారు ముకుందమాలను పునర్ముద్రణముచేయుచు మహారాజశ్రీ తాటికొండ అనంతారెడ్డి దేశముఖుగారు, తమ ఆస్థాన విద్వాంసులగు జాతక విద్వన్మణి శ్రీ తిరుమల బుక్కపట్టణము వెంకటాచార్యులగారల ద్వారా ముకుందమాల నాంధ్రీకరించుటకును, పీఠికను వ్రాయుటకు నన్ను గోరి నాకు సదవకాశ మొసగినారు. ఈ విధముగ బహురీతుల విద్యాపోషణము చేయుచున్న శ్రీ రాణిగారికిని, వీరి కుమారులగు యువరాజా సోమభూపాలబహదూర్ (అమరచింత సంస్థానము) గారికిని ఇతోధికముగా ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులనొసఁగి శ్రీ కురుమూర్తి శ్రీనివాసస్వామి రక్షించుగాక !

తారణ భాద్రపద శుద్ధ ౧౪ శుక్రవారము
హైదరాబాదు (దక్షిణ)

ఇట్లు
చలమచర్ల రంగాచార్యులు
వ్యాకరణ శిరోమణి.

## మాకు లభించినట్టి ముద్రిత ముకుందమాల ప్రతులు.

| సంవత్సరము | ముద్రాలయము | ప్రకటనస్థలము | లిపి | విశేషములు |
|---|---|---|---|---|
| ౧౮౯౩ | నిర్ణయసాగరము | బొంబాయి | నాగరి | కావ్యమాలలో |
| ౧౯౧౨ | కురుమూర్తి శ్రీనివాసముద్రాలయము | ఆత్మకూరు సంస్థానము | తెలుగు | టీకా తాత్పర్య సహితము |
| ౧౯౧౩ | ఆనంద... | మద్రాసు | తెలుగు | స్తోత్రార్ణవములో |
| ౧౯౨౪ | శశిరేఖా... | ,, | ,, | సంస్థానము ఆత్మకూరివారి టీకాసహితము |
| ౧౯౨౫ | ఆంధ్ర గ్రంథాలయము | గార్ల (నైజాం) | ,, | సటీకా- తెలుగు పద్యములు గలవు. |
| ౧౯౨౬ | వావిళ్ల | మద్రాసు | నాగరి | |
| ౧౯౨౮ | ,, | ,, | ,, | ,, |
| ౧౯౩౩ | కేసరి | మద్రాసు | ,, | సటీక |
| ౧౯౩౪ | ఆంధ్రగ్రంథాలయం | బయ్యానగూడెం (నైజాం) | ,, | తెలుగు పద్యములతో |
| ౧౯౩౭ | శ్రీపతి | రాజమహేంద్రవరం | ,, | టీకాసహితము |
| ౧౯౩౯ | ప్రభాకర... | గద్వాల | ,, | తెలుంగుపద్యములు మాత్రమే. |
| ౧౯౩౪ | వావిళ్ళ | మద్రాసు | ,, | సటీక |
| | బెంగుళూరు | బెంగుళూరు | ,, | స్తోత్రజాలములో |
| | ,, | ,, | ,, | పంచకాల ప్రకాశికలో |

ఈ పట్టికలోని ప్రతులలో ఆత్మకూరు సంస్థానపు ప్రతి సర్వ విలక్షణముగా నున్నది.

# శ్రీ కురుమూర్తి గిరినిలయ శ్రీలక్ష్మీ శ్రీనివాస సుప్రభాత స్తోత్రమ్

వన్దేయ కుర్మతిగిరీన్ద్రదగీన్ద్ర నీల ।
మాణిక్య మద్భుతగుణౌఘ మమోఘశక్తిమ్ ।
భక్త్యైకసుగ్రహ మపారకృపారసార్ద్రం ।
పద్మాసఖం హరవిరిఞ్చిసమఞ్చితాఙ్ఘ్రిమ్ ॥౧॥

కౌసల్యా సుప్రజా రామ పూర్వాసన్ధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠనరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

కురుమూర్తిశైలభవనే భువనైకమాత శీతాంశుసోదరి విభాతనిభా తమిస్రా । జాతాద్య జాగృహి రహస్యగృహస్య గర్భే క్రీడా సహస్రరసికేఽస్తు శుభం ప్రభాతమ్ ॥౨॥

ఐన్ద్రీదిశా భజతి పాటలిమాన మేషా చాన్ద్రీచ దీప్తి రయతే పరిధూసరత్వమ్ । విన్దన్తి దీపకలికాశ్చ పచేలిమత్వం సిన్ధో స్సుతే జనని తే భవతు ప్రభాతమ్ ॥౩॥

ప్రాగాత్తమిస్రపటలీ ప్రథతేచ సన్ధ్యా రేఖాతతిః కరగతాచ గతా ప్రకాశమ్ । అన్యోన్యసస్మితముఖశ్చ సఖీజనస్తే బుధ్యస్వ పద్మనిలయే తవ సుప్రభాతమ్ ॥౪॥

ఉత్తిష్ఠ కేలిలులితా నలకాన్ ముఖాబ్జే లోలాన్ సమీకురు సమఞ్చయ కుఙ్కుమంచ । సీమన్తమార్గమపి సజ్జయ విప్రకీర్ణం కురుమూర్తినాథదయితే తవ సుప్రభాతమ్ ॥౫॥

త్వాత్పాణి కఙ్కణకలక్వణనానువిద్ధం కేఙ్కారమార రమపావరణ ప్రవృత్తమ్ । ఆకర్ణ్య కర్ణసుభగం ప్రతిబుధ్యతాం తే కాన్త స్సుధార్ణవసుతే తవ సుప్రభా(తే)తమ్ ॥౬॥

సంసేవితుం తవ పదామ్బుజ మమ్బ సీతా రామక్షమాపతి రమూ దృశమానసేన ! శ్రీ శ్రీనివాససుధియా సహితోఽభ్యుపాస్తే ద్వారం సుధాబ్ధిదుహిత స్తవ సుప్రభాతమ్ ॥౭॥

## శ్రీ శ్రీనివాస సుప్రభాత స్తోత్రమ్

పద్మావతీ కుచతటీ విలసత్పటీర పఙ్కద్రవాఙ్కిత భుజాన్తరకాన్తమూర్తే । తత్కజ్జలోజ్జ్వలకపోల కృపాలవాల శ్రీ శ్రీనివాస భగవంస్తవ సుప్రభాతమ్ ॥౮॥

త్వత్కేలిపుష్కరిణికా కణికానుషక్తా స్తత్రత్యవారిరుహసౌరభ సారభాజః । ఆవాన్తి మన్దమరుతః పరితస్తుషారాః కుర్మూర్తిభూధరమణే తవ సుప్రభాతమ్ ॥౯॥

వైపఞ్చికా నఖముఖాఞ్చల ఘాతచఞ్చు ద్వీణాగుణాఞ్చిత ఘనక్వణనచ్ఛలేన । ముఞ్చన్తి కర్ణకుహరేషు సుధాప్రపఞ్చం పఞ్చాస్త్రసున్దరతనో తవ సుప్రభాతమ్ ॥౧౦॥

ఆరఞ్జయత్యుదయశైల శిరోంశుమాలీ వ్యాలమ్బతేఽస్తగిరి మూర్ధ్ని సుధాంశురేషః । తారాశ్చ భాన్తి విరలా దివి దూరదూరా వ్యాలోచతాం త్రిభువనావన తే ప్రభాతమ్ ॥౧౧॥

ద్వారేస్థితా హరవిరిఞ్చిపురన్దరాద్యాః స్వస్వాధికార పదకార్య నివేదనాయ । కాఙ్క్షన్తి జాగరదశాం భగవం స్త్వదీయాం నిద్రాం జహీహి భవతాత్తవ సుప్రభాతమ్ ॥౧౨॥

లక్ష్మీస్సతీ సముచితం ప్రథమం ప్రబుధ్య త్వత్పాద పద్మపరిసేవన లాలసాపి । త్వత్స్వాప విచ్యుతిభయా దనువర్తతే త్వా ముత్తిష్ఠ కుర్మతిపతే తవ సుప్రభాతమ్ ॥౧౩॥

ప్రాభాతికీం భగవతీ మభివన్ద్య సన్ధ్యాం శుద్ధా విశుద్ధవసనా స్స్ఫురదూర్ధ్వపుణ్డ్రాః । సాన్ద్రాః ఫలాఞ్చితకరా శ్శతశోద్విజేన్ద్రా ద్వారి స్ఫురన్తి భగవంస్తవ సుప్రభాతమ్ ॥౧౪॥

శ్రీ ముక్కరాన్వయ సుధాజలధీన్దు సీతారామ క్షమాపతి మణీన్ద్ర పణాయితాంఘ్రి । శ్రీవాస సూరికవన శ్రవణైక తాన శ్రీ కుర్మతీన్ద్ర భగవం స్తవ సుప్రభాతమ్ ॥౧౫॥

భువనోత్తరేణ భువి సౌప్రభాతిక స్తవనేన సమ్పదవనేన యోఽమునా । హరిమిన్దిరాంచ పరిబోధయే దిమాపరమస్య హృష్టపరమా ప్రసీదతః ॥౧౬॥

శ్రీమత్తిరుమల బుక్కపట్నాభిజన "బాలసరస్వతీ" "తర్కతీర్థ"

శ్రీనివాసాచార్య విరచితా

కురుమూర్తి శ్రీలక్ష్మీ శ్రీనివాస సుప్రభాత స్తుతిస్సమాప్తా.

---

శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ కృష్ణాష్టకమ్.



౧॥ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణంవన్దే జగద్గురుమ్ ॥

౨॥ అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్ !
రత్నకఙ్కణకేయూరం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౩॥ కుటిలాలక సంయుక్తం పూర్ణచన్ద్ర నిభాననమ్।
విలసత్కుణ్డలధరం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౪॥ మన్దారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణంవందే జగద్గురుమ్॥

౫॥ ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్ ।
యాదవానాంశిరోరత్నం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౬॥ రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్ ।
అవాప్తతులసీగన్ధం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౭॥ గోపికానాం కుచద్వన్ద్వ కుఙ్కుమాఙ్కితవక్షసమ్ ।
శ్రీనివాసం మహేష్వాసం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౮॥ శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।
శఙ్ఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్॥

* * * * * *

కృష్ణాష్టకమిదంపుణ్యం ప్రాతరుత్థాయ యఃపఠేత్ ।
కోటిజన్మకృతంపాపం తత్ క్షణాదేవ నశ్యతి॥



శ్రీః

# శ్రీ కురుమూర్తిస్వామి మూలవరులు



శ్లో॥ శ్రీమానమేయ భూమా వైమానిక గీయమాన నిజనామా।
కురుమతి గిరీన్ద్రధామా శర్మతనోత్వ నుపమాన గుణసీమా॥

శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

# శ్రీ కృష్ణాష్టకమ్.



౧॥ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణంవన్దే జగద్గురుమ్ ॥

౨॥ అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్ !
రత్నకఙ్కణకేయూరం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౩॥ కుటిలాలక సంయుక్తం పూర్ణచన్ద్ర నిభాననమ్।
విలసత్కుణ్డలధరం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౪॥ మన్దారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణంవందే జగద్గురుమ్॥

౫॥ ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్ ।
యాదవానాంశిరోరత్నం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౬॥ రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్ ।
అవాప్తతులసీగన్ధం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౭॥ గోపికానాం కుచద్వన్ద్వ కుఙ్కుమాఙ్కితవక్షసమ్ ।
శ్రీనివాసం మహేష్వాసం కృష్ణంవన్దే జగద్గురుమ్॥

౮॥ శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।
శఙ్ఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్॥

* * * * * *

కృష్ణాష్టకమిదంపుణ్యం ప్రాతరుత్థాయ యఃపఠేత్ ।
కోటిజన్మకృతంపాపం తత్క్షణాదేవ నశ్యతి॥





శ్రీః



శ్రీ కురుమూర్తి శ్రీనివాస పరబ్రహ్మణేనమః

# ముకున్దమాల

## ప్రతిపద టీకా తాత్పర్యసహితము



* శ్లో॥ ఘుష్యతే యస్యనగరే । రఙ్గయాత్రా దినేదినే
తమహం శిరసావన్దే । రాజానం కులశేఖరమ్॥ ౧.

టీక॥ యస్య-ఏ కులశేఖరులయొక్క, నగరే-పట్టణమునందు, దినే దినే-ప్రతిదినంబునను, రఙ్గయాత్రా-(క్రొల్లియనెడి) శ్రీరంగమునుగూర్చిన ప్రయాణము, ఘుష్యతే-మ్రోగుచున్నదో (చాటింపబడుచున్నదో), తం-ఆ, కులశేఖరమ్-కులశేఖరులని ప్రసిద్ధిఁజెందిన, రాజానం-రాజును, శిరసా ఉత్తమాంగముతో, అహమ్-నేను, వందే-సేవించుచున్నాను.

తా॥ ఏ కులశేఖరులయొక్క పట్టణమునఁ బ్రతిదినంబునను శ్రీరంగమునుగూర్చిన యాత్ర ఘోషింపబడుచున్నదో, ఆకులశేఖరులను నేను శిరస్సుతోఁ బ్రణమించెదను.

---

* ఘుష్యతే యత్రనగరే: అని పాఠముగలదు, ఆపాఠములో యత్ర-ఏ, నగరే- పట్టణమందు అని యర్థము.

* శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుణ్ఠనకోవిదేతి ।
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకున్ద ॥౨॥

టీక॥ హేముకుంద-ఓముక్తినిచ్చువాఁడా, శ్రీవల్లభ—శ్రీ-లక్ష్మీ దేవికి, వల్లభ-ప్రియుఁడా, ఇతి-అని, వరద-కోరిన వరములను ఒసంగు వాఁడా, ఇతి-అని, దయాపర-దయయే ప్రధానముగాఁగలవాఁడా, ఇతి-అని, భక్తప్రియ-భక్తులకు, ప్రియ-ఇష్టుఁడా, ఇతి-అని, భవలుణ్ఠన కోవిద-భవ-సంసారమనెడి పాశమును, లుణ్ఠన-అపహరించుటయందు, కోవిద-నేర్పు గలవాఁడా, ఇతి-అని, నాథ-ప్రభువా, ఇతి-అని, నాగశయన-ఆదిశేషుఁడే పాన్పుగాఁ గలవాఁడా, ఇతి-అనియు, జగన్నివాసా—జగత్-ప్రపంచము నకు, నివాస-ఆధారమైనవాఁడా, ఇతి-అని, ఆలాపనం-ఉచ్చారణచేయు టను, మే-నాకు, ప్రతిపదం-ఎల్లప్పుడును, కురు-దయచేయుము.

తా॥ ఓముకుందా, లక్ష్మీవల్లభ దయాపర భక్తజన ప్రియ సంసార ధ్వంసీ నాథ శేషశాయీ జగదాధారభూతా యని నీ నామ సంకీర్తనము చేయుటను నాకు ఎల్లప్పుడు దయచేయుము.

శ్లో॥ జయతు జయతు దేవో । దేవకీనన్దనోఽయం
జయతు జయతు కృష్ణో । వృష్ణివంశ ప్రదీపః
జయతు జయతు మేఘ । శ్యామలః కోమలాఙ్గో
జయతు జయతు పృథ్వీ । భారనాశో ముకున్దః॥ ౩॥

టీక॥ దేవకీనందనః - శ్రీ దేవకీ దేవియొక్క, నందనః-పుత్రుఁడగు, అయం-ఈ, దేవః-భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు, జయతుజయతు-అందఱి కంటె నుత్కృష్టుండగుఁగాక, వృష్ణివంశ ప్రదీపః-వృష్ణివంశమను యాదవ

---

* ఆలాపినం ప్రతిపదం కురుమాం ముకుంద అని పాఠాంతరము. ఇతి అని మాం-నన్ను, ప్రతిపదం-మాటకిమాటికి, ఆలాపినం - మాటలాడు వానినిగా, కురు-చేయుము అని యర్థము.

వంశమునకు ప్రకాశము గలుగఁజేయువాఁడయిన, కృష్ణః-శ్రీకృష్ణపరమాత్మ జయతు జయతు-సర్వోత్కృష్టుండగుఁగాక, మేఘశ్యామలః-మేఘమువలె నల్లని దేహచ్ఛాయగల, కోమలాంగః-మెత్తని అవయవములుగల (శ్రీకృష్ణ మూర్తి,) జయతు జయతు-సర్వదేవతలకంటె నధికుఁడగుఁగాక, పృథ్వీభార నాశః-పృథ్వీ - భూమియొక్క, భార - బరువును, నాశః-పోఁగొట్టునట్టి, ముకున్దః-శ్రీకృష్ణమూర్తి, జయతుజయతు-సర్వోత్కృష్టుండగునుగాక॥

తా॥ దేవకీదేవియొక్క పుత్రుఁడును వృష్ణి వంశమునకుఁ బ్రకాశ కుఁడును నీలమేఘశ్యాముఁడును మృదులమైన యంగములు గలవాఁడును దుష్ట రాక్షస సంహారముచేతను భూభారమును దగ్గించువాఁడునునగు శ్రీకృష్ణమూర్తి సర్వోత్కృష్టుఁడుగా నగును గాకయని దీవించుచున్నారని తాత్పర్యము॥

శ్లో॥ ముకున్ద మూర్ధ్నా ప్రణిపత్యయాచే
భవన్త మేకాన్తమియన్తమర్థమ్ ।
అవిస్మృతి స్త్వచ్చరణారవిన్దే
భవేభవే మేఽస్తుభవత్ప్రసాదాత్ ॥ ౪॥

టీక॥ హే ముకున్ద-ఓ ముకుందుడా, మూర్ధ్నా-శిరస్సుతో, ప్రణి పత్య-దండము సమర్పించి, భవన్తం-నిన్ను, ఏకాన్తం-ఒక్కటియైన, లేక ఏకాంతమ్-రహస్యముగా, ఇయన్తమ్—అర్థమ్-ఈమాత్రము కార్యమును, యాచే-వేడుచున్నాఁడను, భవత్ప్రసాదాత్-నీయనుగ్రహమువలన, త్వచ్చ రణారవిన్దే—త్వత్-నీయొక్క, చరణారవిన్దే-కమలములను బోలిన పాద ములందు, అవిస్మృతిః-మరవకుండుట అనగా తలంపు, మే-నాకు, భవే భవే-ప్రతిజన్మమందును, అస్తు-కలుగునుగాక.

తా॥ ఓ ముకుందా, దేవరవారికి శిరస్సుతో దండము సమర్పించి దేవరవారి నెల్లప్పుడు నొక స్వల్పసంగతి వేడుకొనెదను. (అదేదియనఁగా) ప్రతి జన్మమునను దేవరవారి యనుగ్రహమువలన దేవరవారి పాదము లందే జ్ఞప్తి యుండవలయు ననునదే॥

శ్లో॥ నాహం వన్దే తవ చరణయో । ర్ద్వన్ద్వమద్వన్ద్వహేతోః
కుమ్భీపాకం గురుమపి హరే । నారకం నాప నేతుమ్

రమ్యారామా మృదుతనులతా । నన్దనే నాపి రన్తుం
భావే భావే హృదయభవనే । భావయేయం భవన్తమ్॥

టీక॥ హేహరే-ఓముకుందుడా, అహం-నేను, అద్వన్ద్వహేతోః-చలి, వేడిమి, దుఃఖము, సుఖము, అను ద్వంద్వదుఃఖములు లేకుండుటకై, తవ-దేవరవారియొక్క, చరణయోః-పాదములయొక్క, ద్వంద్వమ్-జంటను, నవన్దే-నమస్కరించువాఁడనుగాను, గురుమపి-ఓర్వరానిదైనను, కుంభీపాకం-కుంభీపాకమను పేరుగల, నారకమ్-నరకమును, అపనేతుమ్-పోగొట్టుటకై, (అహంతవచరణయోః ద్వంద్వం నవందే-దేవరవారి పాదములకు నేను దండము సమర్పించువాఁడనుగాను.) మృదుతనలతాః—మృదు-మెత్తని, తనులతాః-తీగెలవంటి దేహముగల, రమ్యాః-సౌందర్యవతులయిన, రామాః-స్త్రీలతోఁడ (యువతులతోఁడ) ఇది తాత్పర్యార్థము గాని పదార్థముగాదు. రామాః అను పదము తరువాత ప్రాప్యలని అధ్యాహారము చేసిగాని రంతుం అను పదమునకు రమయితుం అని అర్థమందు గాని భోక్తుం అను అర్థమందుగాని లక్షణ నాశ్రయించిగాని పదార్థమును వర్ణింపవలయును. నన్దనే-నందనమనెడి యింద్రుని యుద్యానమునందు, రన్తుమపి-క్రీడింపవలెననిమైనను (నాహంవన్దే తవచరణయోర్ద్వన్ద్వం-దేవరవారి పాదములకు దండము సమర్పించువాఁడనుకాను.) భావేభావే-ప్రతి జన్మమునందును, హృదయభవనే-మనస్సనెడి యింటియందు, భవన్తమ్-దేవరవారిని, భావయేయం-ధ్యానింతును) అని [అహంతవచరణయోః ద్వంద్వంవన్దే]- దేవరవారి పాదములను సేవించుచున్నాను.

తా॥ ఓ ముకుందా! నాకు సుఖము, దుఃఖము, ఆసక్తి, విరక్తి, ఎండ, వెన్నెల మొదలగునవి లేకుండవలెననికాని, కుంభీపాకము మొదలగు నోర్వరాని నరకబాధలు లేకుండవలెననికాని, స్వర్గమున సుందరులై మృదులమైన యంగములు గల రంభాద్యప్సర (స్త్రీ)లతోఁగూడి నందనవనమునందు విహారము చేయవలెననికాని నేను దేవరవారికి దండము సమర్పించుటలేదు. అయితే ప్రతి జన్మమునను దేవరవారి పాదయుగళము నందు ధ్యానము గలుగవలెనని తలంచి మాత్రమే నీ పాదద్వంద్వమునకు వందనము చేయుచున్నాను.

శ్లో॥ నాస్థా ధర్మే న వసునిచయే । నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ । పూర్వకర్మానురూపమ్
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం । జన్మజన్మాన్తరేపి
త్వత్పాదామ్భోరుహయుగగతా । నిశ్చలాభక్తిరస్తు॥ ౬॥

టీక॥ ధర్మే-పుణ్యసంపాదనమునందు, ఆస్థా-ఆసక్తి, (మమ-నాకు) న (అస్తి)-లేదు, వసునిచయే-ధనరాశియందు, (ఆస్థా-ఆసక్తి, మమ-నాకు,) న (అస్తి) లేదు, కామోపభోగే-సంసారమునందలి స్త్రీ సుఖముల ననుభవించుటయందు, ఆస్థా-ఆసక్తి, మమ-నాకు, న (అస్తి) ఏవ-లేనేలేదు హేభగవన్-ఓ పరమాత్మా, యత్ యత్-ఏదియేది, భవ్యమ్-కావలసి యున్నదో, (తత్ తత్-అదియది), పూర్వకర్మానురూపమ్-ముందటి జన్మమునందలి పాపపుణ్యములైన కర్మములకుఁ దగినట్టిదిగా, భవతు-అగునుగాక, జన్మజన్మాంతరేఽపి-ప్రతిజన్మమునందును, త్వత్ . . . గతా— త్వత్-దేవరవారియొక్క, పాదామ్భోరుహ-కమలములవంటి పాదముల యొక్క, యుగ-జంటను, గతా-పొందిన, నిశ్చలా-దృఢమయిన, భక్తిః-అనురాగము, అస్తు-కలుగునుగాక, (ఇతి-అని) ఏతత్-ఇదే, ప్రార్థ్యమ్-కోరఁ దగినది, మమ-నాకు, బహుమతమ్-మిక్కిలి యిష్టమయినది.

తా॥ ఓ భగవంతుఁడా! నాకు పుణ్యము రావలెనని కాని, ద్రవ్యము సంపాదింపవలెనని కాని, సకల కామసౌఖ్యముల ననుభవింపవలెనని కాని యిష్టములేదు. అవి యన్నియు పూర్వజన్మ పుణ్యపాపముల కనుసారంబుగా జరుగును. అయితే ఎల్లప్పుడు జన్మజన్మములోను దేవర వారి దివ్య పాదారవిందములందు దృఢమయిన భక్తి కలుగవలెననునదే నాకు ఇష్టమయిన ప్రార్థనయని కులశేఖరాళ్వారు షడ్గుణ విశిష్టుఁడగు ముకుందునిఁ బ్రార్థించుచున్నారు.

శ్లో॥ దివి వా భువి వా మమాస్తు
వాసో నరకే వా నరకాన్తక ప్రకామమ్ ।
అవధీరిత శారదారవిన్దౌ
చరణౌ తే మరణేఽపి చిన్తయామి॥ ౭॥

టీక॥ నరకాన్తక - నరకాసురుని సంహరించిన ఓ భగవంతుఁడా, మమ-నాకు, దివి వా-స్వర్గమందుఁగాని, భువి వా-భూలోకమందుఁగాని,

నరకే వా-నరకమునందుఁగాని, వాసః-ఉనికి, అస్తు-కలుగని, ప్రకామమ్-సమ్మతమేను, అవ...విన్ద్రా—అవధీరిత-తిరస్కరింపఁబడిన, శారద-శరదృతువునందు వికసించిన, అరవిన్దా-కమలములుగల, తే-దేవరవారి యొక్క, చరణౌ-పాదములను, మరణేఽపి-మృతిసమయంబునందుఁగూడ, చింతయామి-ధ్యానించుచున్నాను.

తా॥ ఓ నరకాంతకా, నేను భూమిలోనైనను, స్వర్గమున సుఖములనుభవించుచున్నైనను, నరకమున బాధపడుచున్నైన నుండ సమ్మతమే, ఎక్కడనుండినను మరణకాలమునందుఁగూడ శరత్కాల పద్మమునకంటెఁ గాంతి మంతములైన దేవరవారిపాదములను ధ్యానము చేయుచున్నాను అని తాత్పర్యము.

శ్లో॥ కృష్ణత్వదీయ పదపఙ్కజపఞ్జరాన్త
రద్యైవ మేవిశతు మానసరాజహంసః।
।ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే। ౮॥

టీక॥ హేకృష్ణ-ఓకృష్ణమూర్తీ, మే-దాసునియొక్క, మానసరాజహంసః-మనస్సనెడి రాయంచ, త్వదీ...రాన్తమ్—త్వదీయ-దేవరవారి సంబంధమైన, పదపఙ్కజ-కమలములవంటి పాదములనెడి, పఞ్జర-పంజరముయొక్క, అన్తః-లోపలిభాగమునందు, అద్యైవ-ఇప్పుడే, విశతు-ప్రవేశించునుగాక, ప్రాణప్రయాణసమయే - పంచప్రాణములు (దేహమును బాసి) పోవువేళను, కఫవాతపిత్తైః-కఫ-శ్లేష్మము, వాత-వాయువు, పిత్తైః-ఉష్ణము అను త్రిదోషంబులచేతను, కంఠావరోధనవిధౌ—కంఠ-కంఠముయొక్క, అవరోధనవిధౌ-మూఁతపడుటయను కార్యము, (సతి-కలుగఁగా) తే-దేవరవారియొక్క, స్మరణం-ధ్యానము, కుతః-ఎట్లు (భవేత్-కలుగును).

తా॥ ఓకృష్ణమూర్తీ నామనస్సనెడి రాయంచ యిప్పుడే దేవరవారి పాదములనెడు పంజరంబునందుఁ బ్రవేశించునుగాక. (దేవరవారి పాదధ్యానము ఈదినమే దాసునికిఁ గలుగునుగాక.) ఏలయనిన ప్రాణము పోవు సమయములో వాతపిత్త శ్లేష్మములచేత గొంతు మూతపడి నోటు తెఱవలేకయుండఁగా దేవరవారి పాదములను స్మరించువిధమెట్లు, అప్పుడు

అది సాధ్యపడదు గావున నిపుడే నామనస్సును నీపాద ధ్యానమునందుఁ జేర్చెదను.

శ్లో॥ చిన్తయామి హరిమేవ సన్తతం । మన్దమన్ద హసితానన ామ్బుజమ్
నన్దగోపతనయం పరాత్పరం। నారదాది మునిబృన్దవన్దితమ్॥ ౯॥

టీక॥ నన్దగోపతనయం-నందునికి సుతుఁడును, పరాత్పరమ్-మిక్కిలి శ్రేష్ఠుఁడును, నార...తమ్, నారదాది-నారదుఁడు మొదలుగాఁగల, మునిబృంద-మునులసమూహముచేత, వందితమ్ - నమస్కరింపఁబడినవాఁడును, మన్ద...జమ్—మన్ద మన్దహసిత-మిక్కిలి స్వల్పమయిన చిఱునగవుగల, ఆననామ్బుజమ్-కమలమువంటి మోముగలవాఁడునైన, హరిమేవ-శ్రీమహావిష్ణువునే, చిన్తయామి-తలంచుచున్నాను.

తా॥ నందుని ప్రియసుతుఁడును, ఉత్తమోత్తముఁడును, నారదుఁడు మొదలగు మహామునులచేఁ గొనియాడఁబడుచుండువాఁడును, చిఱునగవు మోముఁగలవాఁడునునైన శ్రీకృష్ణుని నేను మనంబునఁ దలంచుచున్నాను.

శ్లో॥ కరచరణసరోజే కాన్తిమన్నేత్రమీనే
శ్రమముషిభుజవీచి వ్యాకులేఽగాధమార్గే ।
హరి సరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం
భవమరుపరిఖిన్నః ఖేదమద్యత్యజామి॥ ౧౦॥

టీక॥ భవమరు పరిఖిన్నః—భవ-సంసారమనెడి, మరు - నీళ్లులేనిచోటఁ (దిరుగుటచేతను) పరిఖిన్నః-డస్సినట్టి, (అహం-దాసుఁడనైననేను) కరచరణసరోజే-చేతులుకాళ్లు అను కమలములు గలదియు, కాన్తిమన్నేత్రమీనే—కాన్తిమత్-కాంతిగల, నేత్ర-కన్నులనెడి, మీనే-చేపలుగలదియు, శ్రమముషి-బడలికను బోఁగొట్టునదియు, భుజవీచివ్యాకులే—భుజ-చేతులనెడు, వీచి-అలలచేతను, వ్యాకులే-కలఁగినదియు, అగాధమార్గే-లోఁతయిన త్రోవగలదియునగు, హరిసరసి-శ్రీమహావిష్ణువను కొలనిలో, విగాహ్య-ప్రవేశించి, తేజోజలౌఘం-తేజస్సనెడు జలసమూహమును, ఆపీయ-మెండుగా పానముచేసి, ఖేదం-బడలికను, అద్య-ఇప్పుడు, త్యజామి-విడుచుచున్నాను.

తా॥ దాసుఁడయిన నేను సంసారమను నిర్జలభూమిలోఁ దిరిగినవాఁడనై మిక్కిలి దప్పిగొనియున్నాను గనుక, కాలు సేతులనెడు కమల

ములు గలిగి, తళతళ మెఱయుచుండు నేత్రములనెడు చేఁపలతో గూడి, భుజములనెడి యలలచేఁ గలతనొందియుండునట్టిదియు, యలసటను బోఁ గొట్టునట్టిదియునగు శ్రీమన్నారాయణుఁడను కొలనులోదిగి, చక్కఁగా ఆ నారాయణమూర్తియొక్క దివ్యతేజస్సనెడి యమృతమును సంపూర్తిగా పానముచేసి, నాకుఁగల బడలిక నిప్పుడే పోఁగొట్టుకొనుచున్నాను. (నీళ్ళు లేని యెడారిలోఁ దిరుగువాఁడు మిక్కిలి దప్పిగొని యనేకములయిన తామరపూవులు గలిగి యలలు గొట్టుచుండు నొక కొలనిలోదిగి పూర్తిగా నీళ్ళు త్రాగి, వానికి గల దప్పిని యెట్టుదీర్చుకొనునో, అట్లే నేనును ఈ సారములేని సంసారమందు తిరిగితిరిగి డస్సి యా శ్రీమన్నారాయణ మూర్తిని జేరి, యా పరాత్పరుని తేజస్సును (బ్రహ్మతేజస్సును) గుర్తెఱిఁగి, సంసార ఖేదము నిప్పుడే వదలిపెట్టుచున్నాను.

* శ్లో॥ సరసిజనయనే సశఙ్ఖచక్రే
మురభిది మా విరమస్వ చిత్త రన్తుమ్ ।
సుఖతరమపరం న జాతు జానే
హరిచరణస్మరణామృతేన తుల్యమ్॥ ౧౫॥

టీక॥ హే స్వచిత్త-ఓ నామనసా, సరసిజనయనే - కమలములను బోలిన నేత్రములుగలవాఁడును, సశఙ్ఖచక్రే-శంకచక్రములతోఁ గూడిన వాఁడును అగు, మురభిది-మురాంతకుండైన శ్రీమహావిష్ణువునందు, రన్తుమ్-విహరించుటకు, మావిరమ-వెనుకఁదీయకుము, హరి... తేన-హరి-విష్ణువు యొక్క, చరణస్మరణ-చరణధ్యానమనెడు, అమృతేన-అమృతముతో, తుల్యం-సమానమయిన, సుఖతరం-మిక్కిలి యానందమును గలుగఁజేయు నట్టి, అపరం-మఱియొక వస్తువును, జాతు-ఎల్లప్పుడును, నజానే-గుర్తెఱుఁగను.

తా॥ ఓ నామనసా కమలాక్షుఁడును, శంఖచక్రధారియునగు విష్ణునందు రమించుటకు విసుకుఁజెందకుము. ఏలయనిన, హరిపదారవింద ధ్యానంబనెడు నమృతమునకంటె నింపైనది మఱియొక వస్తువును లేదు.

---

* కొందరు మావిరమస్వ-వెనుదీయకుము అని అర్థమును చెప్పు దురు అది తప్పు. విపూర్వక రమధాతు పరస్మైపదిగాని ఆత్మనేపది కాదు. వ్యాఙ్పరిభ్యోరమః అని సూత్రము.

శ్లో॥ మాభీర్మన్ద మనో విచిన్త్య బహుధా
యామీశ్చిరం యాతనాః నామీనః
ప్రభవన్తిహాపరిపవస్స్వామీననుశ్రీధరః।
ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం
* ధ్యాయస్వ నారాయణం
లోకస్యవ్యసనాపనోదనకరో
దాసస్య కింనక్షమః॥

టీక॥ మంద-మూఢమైన, హేమనః-ఓమనసా, యామీః-యముని సంబంధమైన, బహుధా-అనేకవిధములయిన, యాతనాః-నరకబాధలను, చిరం-బహుకాలము, విచిన్త్య-తలంచి, స్థితస్య-ఉండిన, తవ-నీకు, భీః-భయము, మాస్తు-వద్దు, ఇచట-చితిఞి భీధాతువులకు సమాన కర్తృకత్వ మునుబట్టి, ల్యప్సాధువు-స్థితస్య-తవఅనునది అధ్యాహృతము, అమీ- ఈ, పాపరిపవః - పాపములనెడు శత్రువులు, నః-మనకొరకు, నప్రభవంతి-సమర్థములుకావు, అనగా-మనలను ఏమియుచేయఁజాలవు, శ్రీధరః-విష్ణువు, నః-మనకు, స్వామీనను ప్రభువుకదా అనగా- శేషిగదా, ఆలస్యం-జాగు చేయుటను, వ్యపనీయ-పోఁగొట్టి (విడిచి), భక్తిసులభం-భక్తిచేతసులువుగా పొందదఁగిన, స్వ నారాయణం-మనవిష్ణువును, ధ్యాయ-ధ్యానము చేయుము, లోకస్య-ప్రపంచమునందలిజనులయొక్క, వ్యస...కరః, వ్యసన దుఃఖముయొక్క, అపనోదన-పోఁగొట్టుటను, కరః-చేయునట్టి(సః-ఆనారా యణమూర్తి) దాసస్య-భక్తునియొక్క, వ్యసనాపనోదకరణే-వ్యసనమును పోగొట్టుటయందు-నక్షమఃకిం-సమర్థుడుకాడావేమి॥

తా॥ ఓ మూఢమనసా, నీవు కుంభీపాకము మొదలగు ననేక యమబాధలను తలంచుకొని దుఃఖపడకుము. శ్రియఃపతియగు శ్రీమన్నా రాయణుడు మనకు ప్రభువుగా నుండఁగా, ఈపాపము లేమియు మననుఁ జేయఁజాలవు. కాఁబట్టి ఆలస్యము చేయక, భక్తిగమ్యుఁడయిన ఆ నారా

* ధ్యాయస్వ నారాయణం అను చోట స్వ అని పృథక్పదము, మనః అనుదానికి విశేషణము, అథవా స్వనారాయణం అని సమస్తము. ధ్యాయస్వ అని క్రియాపదమని మాత్రము తలచవద్దు. ధ్యైధాతువు-పరస్మైపది. వ్యసనాపనోదకరణే అనునది అధ్యాహృతము.

యణమూర్తిని సేవించుము. అన్నిలోకముల వ్యసనమును బోఁగొట్టునట్టి మన శ్రీమహావిష్ణువేల దాసునియొక్క దుఃఖములను బోఁగొట్టఁడు. అన్నింటిని బోఁగొట్టును అని తాత్పర్యము॥

శ్లో॥ భవజలధి గతానాం ద్వంద్వవాతాహతానాం
సుతదుహితృకళత్రత్రాణభారార్దితానామ్ ।
విషమవిషయతోయే మజ్జతా మప్లవానాం
భవతుశరణమేకోవిష్ణుపోతో నరాణామ్॥ ౧౩

టీక॥ భవ...గతానాం—భవ-సంసారమనెడు, జలధి - సముద్రమును, గతానాం-పొందినవారును, ద్వంద్వ...తానాం—ద్వంద్వ-చలివేడిమి-సుఖదుఃఖములు మొదలగు జంటదుఃఖములనెడి, వాత-గాలిచేతను, ఆహతానాం-కొట్టఁబడినవారును, సుత...నాం—సుత-కొడుకులు-దుహితృ-కూతురులు, కళత్ర-భార్యలు, వీరియొక్క, త్రాణ-రక్షించుటయును, భార-బరువుచేతను, అర్దితానాం-పీడింపఁబడినవారును, విషమ-కష్టమునిచ్చు విషయ-ఇంద్రియసుఖములనెడు, తోయే-నీటియందు, మజ్జతాం-మునుఁగువారును, అప్లవానాం- తెప్పలేనివారునుయగు, నరాణాం-మనుష్యులకు, విష్ణుపోతః, ఏకః - విష్ణువనెడు తెప్పయొక్కటె, శరణం - రక్షకముగా, భవతు-అగునుగాక॥

తా॥ సంసారమను సముద్రమందు మునిఁగి సుఖదుఃఖాదులగు ద్వంద్వములను గాలిచే క్రిందత్రోయఁబడి, సుతదుహితృ కళత్రంబులను రక్షించుటయను భారంబు మోయుటచే మిక్కిలి బడలికనొంది దుష్టములయిన విషయ సుఖంబులను నీటిలో మునిఁగి, తేలుటకు తెప్పలేకయుండు నరులకు ఆవిష్ణువను యోడయొక్కటే రక్షకమగును॥

శ్లో॥ భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితిచేతో మాస్మగాః కాతరత్వమ్।
సరసిజదృశి దేవే తావకీభక్తిరేకా
నరకభిదినిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్॥ ౧౪

టీక॥ హేచేతః-ఓమనసా,అగాధం-లోతయినదిగనుకనే, దుస్తరం-దాఁటశక్యముగాని, భవజలధిం-సంసారమనెడు సముద్రమును, కథం-ఎట్లు, అహం-నేను, నిస్తరేయమ్-దాఁటఁగలను, ఇతి-అని, కాతరత్వం-పిఱికితన

మును, మాస్మగాః-పొందవద్దు, సరసిజదృశి-కమలములవంటి నేత్రములు గల, దేవే-భగవంతుఁడగు, నరకభిది-నరకాసురుని సంహరించిన శ్రీకృష్ణుని యందు, నిషణ్ణా-కూర్చుండిన అనగాకుదురుకొనిన, తావకీ - నీదైవభక్తిః ఏకా—భక్తియొక్కటె, అవశ్యం-ముఖ్యముగా, (త్వామ్-నిన్ను) తార యిష్యతి-దరిజేర్చగలదు॥

తా॥ ఓమనసా మిక్కిలి లోతుగాను దాట శక్యముగాకనునుండు ఈసంసారమనే సముద్రము నెట్లు దాటఁగలనని భయపడఁ బోకుము. ఆకమలాక్షుఁడగు శ్రీకృష్ణునందుంచఁబడిన నిశ్చలమైనభక్తియే నిన్నుఁ దరిఁజేర్చుచున్నది॥

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులేచ ।
సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరదభవతో భక్తినావం ప్రయచ్ఛ॥ ౧౨

టీక॥ తృష్ణాతోయే-ఆశయనెడి నీళ్లుగలదియు, మదన...మాలే— మదన-మన్మథుఁడను, పవన-గాలిచేతను, ఉద్ధూత-పైకిలేపఁబడిన, మోహ అజ్ఞానమును, ఊర్మి-అలలయొక్క, మాలే-వరుసగలదియు, దారావర్తే- దార-భార్యయను, ఆవర్తే-సుళ్లుగలదియు, తన...కులే —తనయ-బిడ్డలను, సహజ-కూడఁబుట్టినవారను, గ్రాహ-మొసళ్లయొక్క, సంఘ-గుంపుచేతను ఆకులే కలఁత పెట్టఁబడినదియునగు, సంసారాఖ్యే-సంసారమను పేరుగల, మహతి-గొప్పదైన, జలధౌ-సముద్రమునందు,మజ్జతాం-మునుగుచున్న,నః- మాకు- హేత్రిధామన్-ఓత్రిధాముఁడా, హేవరద-ఓవరములనిచ్చువాఁడా భవతః-నీయొక్క, పాదాంభోజే-కమలములవంటి పాదములందు, భక్తి నావం-భక్తియనెడియోడను, ప్రయచ్ఛ-ఇమ్ము॥

తా॥ ఓవరము లొసంగునట్టి శ్రీత్రిధాముఁడా! ఆశయను నీళ్లు గలదియు కామవికారములను గాలిచే లేపంబడిన మోహమను యలలు గలదియు, భార్యయను నీటిసుళ్లును, కూతులు, కొడుకులు అన్నతమ్ము లను మొసళ్ళను గలదియునగు సంసారమనే సముద్రములో మునుగు చుండుమాకు, నీపాదములందలి భక్తియనే తెప్పనిచ్చి దాటింపుము॥

శ్లో॥ మాద్రాక్షం క్షీణపుణ్యాన్
క్షణమపిభవతో భక్తిహీనాన్ పదాబ్జే
మాశ్రౌషం శ్రావ్యబన్ధం
తవచరిత మపాస్యాన్య దాఖ్యానజాతమ్॥
మాస్మార్షం మాధవత్వామపిభువనపతే
చేతసా పహ్నువానాన్
మాభూవంత్వత్సపర్యా వ్యతికరరహితో
జన్మజన్మాన్తరేపి॥ ౧౬

టీక॥ హేమాధవ-ఓలక్ష్మీశ్వపతీ, క్షీణపుణ్యాన్-పాపముచేసినవారిని క్షణమపి-ఇంచుకింతసేపయినను, భవతః-నీయొక్క, పదాబ్జే-కమలముల వంటి పాదములయందు, భక్తిహీనాన్-భక్తిలేనివారిని, మాద్రాక్షం-చూడలేను, శ్రావ్యబంధమ్-వినఁదగినరచనగలిగినట్టి, తవ-నీయొక్క, చరితం-కథను, అపాస్య-విడిచి, అన్యత్-ఇతరమైన, ఆఖ్యానజాతం-చరిత్రములసమూహమును, మాశ్రౌషమ్-వినలేను, హేభువనపతే-లోకనాయకుఁడవగు శ్రీకృష్ణమూర్తీ, త్వాం-నిన్ను, చేతసాఽపి - మనస్సుతోనైనను, అపహ్నువానాన్-తిట్టుచుండువారిని, మాస్మార్షమ్-తలంపలేను, జన్మజన్మాన్తరేఽపి-ప్రతియొకజన్మములోను,త్వత్సపర్యావ్యతికరరహితః-త్వత్-నీయొక్క, సపర్యా-సేవయొక్క వ్యతికరరహితః సంబంధములేనివాఁడుగా మాభూవం-కాలేను॥

తా॥ ఓలోకనాథుఁడవగు ఓలక్ష్మీశ్వపతీ, నీపాదంబుల భక్తిలేని పాపాత్ములను జూడలేను నీ పుణ్యకథలులేని యుపాఖ్యానంబులను జదువలేను. నిన్ను మనసుతోనైనను దూరువానిని నేను తలంపలేను. జన్మజన్మములోను శుశ్రూష లేనివాఁడనుగాలేను. అనగా ఎల్లప్పుడు నీయందే భక్తిగల్గి నీకథలను జదువుచు నీ శతృవులతోడి సంసర్గములేక నీకుసర్వదా శుశ్రూష చేయుచున్నాను॥

శ్లో॥ జిహ్వేకీర్తయ కేశవం మురరిపుం। చేతోభజశ్రీధరం
పాణిద్వన్ద్వ సమర్చయాచ్యుతకథా శ్రోత్రద్వయత్వంశృణు।
కృష్ణంలోకయ లోచనద్వయహరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్రఘ్రాణ ముకున్దపాద తులసీం మూర్ధన్న మాధోక్షజమ్॥౧౭॥

టీక॥ హేజిహ్వే-ఓనాలుకా, కేశవం-కేశవుని, కీర్తయ-పాడుము, చేతః-ఓమనసా, మురరిపుం-మురాసురునికి శత్రువైన విష్ణువును, భజ-సేవింపుము, పాణిద్వన్ద్వ-చేతులజంటా (రెండుచేతులా) శ్రీధరం-లక్ష్మీదేవిని(ఱొమ్మునందు) ధరించినవానిని, సమర్చయ-చక్కగాపూజసేయుము హేశ్రోత్రద్వయ ఓచెవులజంటా, అచ్యుతకథాః - విష్ణుకథలను, త్వం-నీవు, శృణు-వినుము, హేలోచనద్వయ-ఓకన్నులజంటా, కృష్ణం-శ్రీకృష్ణుని లోకయ-చూడుము, హేఅంఘ్రియుగ్మ-ఓకాళ్ళజంటా, హరేః-విష్ణువుయొక్క, ఆలయం-గుడిని, గచ్ఛ-పొందుము, హేఘ్రాణ-ఓముక్కా, ముకుస్దపాదతులసీం-విష్ణువుయొక్క పాదములందలి తులసీదళమును, జిఘ్రి-వాసనచూడుము, హేమూర్ధ - ఓశిరమా, అధోక్షజం - విష్ణువును, నమ-స్కరింపుము॥

తా॥ ఓనాలుకా, నీవు కేశవునిఁగీర్తింపుము, ఓమనసా నీవు మురారిని భజింపుము. ఓరెండుచేతులా శ్రీధరుని పూజింపుడు. ఓ రెండుచెవులారా మీరు అచ్యుతుని కథలను వినుఁడు. ఓకన్నులారా శ్రీకృష్ణునిఁజూడుడు. ఓపాదములారా మీరు (హర్యా) విష్ణ్వాలయమునకుఁబొండు ఓనాసికా శ్రీముకుందుని పాదతులసిని వాసనఁజూడుము. ఓశిరసా నీవు అధోక్షజుని నమస్కరింపుము॥

శ్లో॥ హేలోకాశ్శృణుత ప్రసూతి మరణ వ్యాధేశ్చికిత్సామిమాం
యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।
అన్తర్జ్యోతి రమేయమేకమమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్॥ ౧౮

టీక॥ హేలోకాః - ఓజనులారా, ఇమాం - నేనుచెప్పఁబోవునట్టి, ప్రసూతిమరణవ్యాధేః-చావుపుట్టుకలనెడు రోగమునకు,చికిత్సాం-మందును, శృణుత-వినుడి, యాం-ఏ యౌషధమును, యోగజ్ఞాః - యోగశాస్త్రము నెఱింగినట్టి, యాజ్ఞవల్క్యాదయః-యాజ్ఞవల్క్యమహామునిమొదలుగాఁగలవారగు, మునయః-ఋషులు, సముదాహరన్తి-చెప్పుచున్నారో, అంతఃజ్యోతిః-లోపలనే వెలుతురుగలదియు (స్వయంప్రకాశమానమయినదియు), అమేయం-లెక్కపెట్టఁదగనిదియునగు, కృష్ణాఖ్యం-శ్రీకృష్ణమూర్తియనుపేరుగల, అమృతంఏకం-అమృతము యొక్కటె-ఆపీయతాం-త్రాగబడునుగాక-

పీతం-పానముచేయఁబడిన, తత్-ఆ, పరమౌషధం-ముఖ్యమైనయౌషధమే, ఆత్యన్తికమ్-మిక్కిలియధికమయిన, నిర్వాణం-నెమ్మదిని (మోక్షమును) వితనుతే-కలుగఁజేయుచున్నది॥

తా॥ ఓజనులారా, మీకుఁగల్గియుండు జననమరణములను రోగములకు యాజ్ఞవల్క్యుఁడు మొదలగు మహామునులచేఁ జెప్పఁబడియుండు గొప్ప దివ్యౌషధమును జెప్పెదవినుఁడు. తనంతటప్రకాశించు నాయప్రమేయుండగు శ్రీకృష్ణమూర్తియను దివ్యౌషధమును మీరు పుచ్చుకొన్న యెడల మీకు మోక్షమనేనివ్వాళింపుగలుగును॥

* శ్లో॥ హేమర్త్యాః పరమంహితం శృణుతవో । వక్ష్యామిసంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం । సమ్యక్ప్రవిశ్యస్థితాః
నానాజ్ఞానమపాస్యచేతసి నమో । నారాయణాయేత్యముం
మన్త్రింసప్రణవంప్రణామసహితంప్రావర్తయధ్వంముహుః॥౧౯॥

టీక॥ ఆప...ళం- ఆపత్-ఇడుమలనెడు,ఊర్మి-అలలచేత,బహుళం-గొప్పదైన, సంసారార్ణవం-సంసారమనెడుసముద్రమును, సమ్యక్-లెస్సగా, ప్రవిశ్య-చొరఁబడి,స్థితాః-నిలుకడగానుండిన హేమర్త్యాః-ఓమనుష్యులారా, వః-మీకు, పరమంహితమ్-మిక్కిలి మేలుగలిగెడిసంగతిని, సంక్షేపతః-సంగ్రహముగా, వక్ష్యామి- చెప్పఁబోవుచున్నాను, శృణుత-వినుడి,నానాజ్ఞానం-సకలవిధములైనయజ్ఞానములను, అపాస్య, విడిచిపెట్టి, సప్రణవం-ఓంకారరూపముఖ్యప్రణవముతోగాని, అంకారరూపగౌణ ప్రణవముతోగాని గూడినదియు, ప్రణామసహితం-నమస్కారముతోఁగూడినదియునగు, (నమోనారాయణాయ) ఇతిఅముంమన్త్రిం - నమోనారాయణాయయనునీమంత్రమును, చేతసి-మనసునందు, ముహుః-పలుమారు, ప్రావర్తయధ్వం - జపముచేయుడీ॥

తా॥ ఆపదలనెడు అలలతోఁగూడిన సంసారమనెడి సముద్రములోఁ దిరుగుచుండు ఓమనుష్యులారా, మీకందఱికి ముఖ్యముగాఁ గావలసిన మేలైనయొకసంగతి సంగ్రహముగాఁ జెప్పెదనువినుఁడు. ఏదనఁగా, మీరు సకల విధములయిన యజ్ఞానమునువదలి (ఓంనమోనారాయణాయ) అనిగాని, అంనమోనారాయణాయఅనిగాని ఆనుపూర్విగల అష్టాక్షరీమంత్ర

చేయుచుందురు. మైమఱచి యారామకథా సుధారసము గ్రోలుచుందురు. ఒకనాడు పౌరాణికుఁడు శ్రీమద్రామాయణమున అరణ్యకాండము జదువుచుండెను. తన్మయులై కులశేఖరులు వినుచుండిరి. అది ఖరదూషణాది పదునాల్గువేల భయంకర రాక్షసులు శ్రీరామచంద్రు నెదుర్కొనిన ఘట్టము. ఏమగునో యనియట మహర్షుల హృదయములు దల్లడిల్లుచున్నవి. ఇట యీ భక్తాగ్రేసరుని హృదయము తల్లడిల్లఁ జొచ్చినది. ఇంతలో "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమ కర్మణామ్। ఏకశ్చరామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి? అని పౌరాణికుఁడు జదివెను. తద్భావ భావితాంతఃకరణులగు కులశేఖరులకా ఘట్టమంతయుఁ గనులకు గట్టినట్లయ్యెను. తాను మనమార ప్రేమించు రామచంద్రునికేమి యగునో యని తత్తర పడ్డెను. తన వస్తువును తన సర్వస్వమును తాను రక్షించుకొన వలెను. శ్రీరామచంద్రునకు సాయపడవలెను. ఒడలు గగుర్పొడువ, పెదవులదఱ, వెంటనే నా సేనల నన్నిటిని యుద్ధమున కాయత్తము సేయుడు! సేయుఁడు! అని సేనానులకాజ్ఞలిచ్చుచు లేచి ముందుకు సాగబోయెను. పౌరాణికు డింతలో గ్రంథము నందుకొని,

" తం దృష్ట్వా శత్రుహన్తారం మహర్షీణాం సుఖావహం
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"

( శ్రీరామచంద్రుడు శత్రువులనెల్ల మట్టు బెట్టి విజయమునొంది మహర్షులఁ గాపాడి రాగా సంతోషాతిశయమున సీతాదేవి గాగిలించుకొనెను) అని చదువ ఆభగవద్విజయము విని భక్తుని హృదయావేగము శాంతించెను. సేనలు మరలెను.

సీతాపహరణ ఘట్టములోను నిట్లే జరిగెను. "ఇదిగో! దుష్టనిశిక్షించి మాతల్లి చెర విడిపింతునని సేనలతో రావణుని లంకపైకి దండెత్తి యడ్డమువచ్చిన సముద్రములోఁగూడ దిగిపోవుచుండ శ్రీరామచంద్రుఁడే సీతాదేవితోఁగూడ ఆభక్తునకు ఎదురువచ్చి దర్శనమిచ్చెను. తల్లి చెఱ విడినదని దృఢపడ ఆభక్తాగ్రేసరుఁడు తిరిగి వచ్చెను. ఇది నవవిధ భక్తులలో శ్రవణ మను భక్తి.

శ్రీరంగనాథుఁడు తన కిష్టదైవమగు శ్రీరామచంద్రునిచేఁగూడ నారాధింపఁ బడెననియు ఇక్ష్వాకు వంశీయులకెల్ల ఆరంగనాథుఁడే యిలు

మానేగాని అష్టాక్షరమంత్ర మెట్లాయనని శంకరాగా వచనము. (తత్రోక్త్త నారాయణస్యాది ర్బిందుపూర్ణ విష్ణురంతతః। బీజమష్టాక్షరస్య స్యాత్తెనాష్టాక్షరతాం భవేత్॥) దీనియర్థము. నారాయణశబ్దమునందు ఉత్తరదళముగానుండెడి అయన శబ్దముయొక్క ఆద్యవయవమైన విష్ణువాచకమైన అకారము అంతమందు బిందువుగలదై అష్టాక్షరమునకు బీజమాను. అనగా ఆదియందు ఉచ్చరించతగినదియాను. ఈబీజవర్ణముచేరినందున సప్తాక్షరిగాపరిణమించిన అష్టాక్షరీమంత్రమునకు అష్టసంఖ్యాకవర్ణఘటితత్వము సిద్ధమానని. ప్రకృతము స్త్రీలకు శూద్రులకు ప్రణవముకూడదనె అంశము సూక్ష్మముగా తెలుపబడినది. ఉద్గ్రంథములవల్ల పండితులు అధికాంశమును తెలిసికొనవలయును.

శ్లో॥ పృథ్వీ రేణురణుః పయాంసికణికా। ఫల్గుస్స్ఫులిఙ్గోలఘు
స్తేజోనిశ్వసనం మరుత్తనుతరం। రన్ధ్రం సుసూక్ష్మంనభః
క్షుద్రారుద్రపితామహ ప్రభృతయః। కీటాస్సమస్తాస్సురాః
దృష్టేయత్రసతావకో విజయతే। భూమావధూతావధిః॥ ౨౦॥

టీక॥ యత్ర-ఏనీమహిమ, దృష్టేసతి, చూడఁబడినదియగుచుండఁగా, పృథ్వీ-భూమి, అణుః-సూక్ష్మమయిన, రేణుః-దుమ్మో, పయాంసి-సముద్రజలములు, ఫల్గుః-స్వల్పమైన, కణికా-నీటితుంపరో, తేజః-సూర్యచంద్రాగ్నివెలుగులు, లఘుః-చిన్నదగు, స్ఫులింగః-మిణుఁగురో, మరుత్ - గాలి, తనుతరం-మిక్కిలిసన్నదయిన, నిశ్వసనం-నిట్టూర్పో, నభః-ఆకాశము, సుసూక్ష్మం-మిక్కిలిసన్నని, రంధ్రం-బెజ్జమో, రుద్ర-పితామహ, ప్రభృతయః, రుద్ర-ఈశ్వరుఁడు, పితామహ - బ్రహ్మదేవుఁడు, ప్రభృతయః-మొదలుగాఁగలవారగు, సమస్తాఃసురాః- దేవతలందఱును, క్షుద్రాః-చిన్న, కీటాః-పురుగులో, సః-అటువంటి, తావకః-నీదైనట్టి, అవధూతావధిః-అంతములేనట్టి, భూమా-మహిమ, విజయతే-అంతటవ్యాపించియున్నది॥

తా॥ ఓ భగవంతుఁడా! ఏనీమహిమముందఱ భూమి ఒక రేణువో, సముద్రజలము తుంపరలవంటివో, సూర్యచంద్రాగ్నులు సన్నని మిణుగురులో, వాయువు మిక్కిలి సన్నని నిట్టూర్పువంటివాఁడో, ఆకాశము మిక్కిల సన్నని బెజ్జమో, బ్రహ్మరుద్రాదులగు దేవతలు చిన్నపురుగులవంటివారలో అట్టి నీయపారమైన మహిమ సర్వత్ర ప్రకాశించుచున్నది.

అదిగో ! ఆ స్వామి పుష్కరిణిలోఁ దళుకుతళుకున నెగురుచు నీదులాడు చేపలలో నొక చిన్న చేపపిల్లనగునట్లనుగ్రహింపరాదా ! తండ్రీ ! నీ గర్భమందిరమునకు గడపగా నుండ దయఁజూచిన నిచ్చట నీభక్త పాదధూళిలోనలిగి నీ పాదారవిందములు సేవించుచుందునే !' అని స్తుతించి భక్త్యావేశమున వివశులై పడిపోయిరట. (పెరుమాళ్ తిరుమొழி) నేఁటికిని తిరుపతి వేంకటేశ్వరస్వామి గర్భాలయములోని గడపకు కులశేఖరప్పడి అను వ్యవహారముగలదు. మహాభక్తులకుఁగాని యిట్టి తన్మయత గలుగదు.

కులశేఖరులట్లు కొంతకాలము జనకమహారాజువలె నిర్లిప్తులుగనే రాజ్యమేలి యీ మాత్రపు లౌకికసంబంధముగూడ నొల్లక అనురూపగుణుఁడగు కుమారునికి రాజ్యమిచ్చి తాము శ్రీరంగము, తిరుమల మున్నగుదివ్యదేశములకేగి పెన్నిధినిగన్నపేదచందంబున భక్త్యావేశముతో (ద్రావిడభాషలో ముప్పదిపాశురములతో శ్రీరంగనాథుని డెబ్బది యేడు పాశురములతో శ్రీ వేంకటేశ్వరుని శ్రీకృష్ణుని శ్రీరామచంద్రుని స్తోత్రము చేసిరి. సంస్కృతభాషలోను అమృతములొలుకు పద్యప్రసూనములతో మాలగట్టి భగవత్కంఠసీమ నలంకరించి తరించిరి. ఈ శ్రీకులశేఖరుల ద్రావిడస్తోత్రమే 'పెరుమాళ్ తిరుమొழி' అను తిరునామముతో భాగవతవిజ్ఞాన రత్నకోశమగు నాలాయిరములో విరాజిల్లుచున్నది. శ్రీ కులశేఖరాళ్వారు రచించిన సంస్కృతస్తోత్రమే ప్రకృతమగు ముకుందమాల.

## * ముకుందమాల - శ్రీకృష్ణస్తోత్రము.

మొదటిపద్యమున ముకుంద ! అని సంబోధించి చేసినస్తోత్రమాల గావున దీనికి 'ముకుందమాల' యను వ్యవహారము గలిగియుండును. మఱియు ఈ స్తోత్రమున విష్ణు పర్యాయములగు శ్రీ వల్లభ నారాయణాది పదములు యథేష్టముగాఁ బ్రయోగింపఁబడినను చాల పద్యములలో ముఖ్య సంబోధనము ముకుందపదముతోనే గన్పడుటయు దీనికీ పేరువచ్చుటకుఁ గారణమైయుండును. మన దక్షిణభారత ప్రతులలో లభింపలేదు

---

* ముకుందశబ్ద నిర్వచనము:- ముకుమ్ దదాతీతి ముకుందః= మోక్షమునిచ్చువాఁడు 'ముకుంభక్తిరసప్రేమ వచనం వేదసమ్మతం యస్తద్దదాతి భక్తేభ్యో ముకుందస్తేన కీర్తితః' బ్రహ్మవైవర్తము.

హేమాధవ-ఓలక్ష్మీ వల్లభుఁడా, హేరామానుజ-ఓబలరాముని తమ్ముఁడా, హేజగత్త్రియగురో-ఓ ముల్లోకముల నేలువాఁడా-హేపుణ్డరీకాక్ష-తెల్ల కమలములవంటి నేత్రములుగలవాఁడా - హేగోపీజననాథ - ఓ గోపస్త్రీ ప్రియుఁడా, మాం-నన్ను, (త్వం-నీవు) పాలయ-కాపాడుము, త్వాంవినా-నిన్నుతప్ప, పరం-ఇంకొకనిని, (అహమ్-నేను) నజానామి-ఎఱుఁగను.

తా॥ ఓ గోపాల, ఓ కృపానిధీ, ఓ సింధుకన్యాపతీ, ఓకంసాంతకా, ఓ గజేంద్రరక్షకా, ఓ మాధవా, ఓ రామానుజా, ఓ జగద్గురూ, ఓ పుండరీకాక్షా, ఓ గోపీవల్లభా, నన్నుఁగాపాడుము. నీవుతప్ప నాకెవరును తెలియదు. నీవే నాకు గతి.

శ్లో॥ భక్తాపాయ భుజఙ్గగారుడమణి । స్త్రైలోక్యరక్షామణి
ర్గోపీలోచన చాతకామ్బుదమణి । స్సౌందర్యముద్రామణిః
యఃకాన్తామణి రుక్మిణీఘనకుచ । ద్వన్ద్వైక భూషామణి
శ్శ్రేయో దేవ శిఖామణి ర్దిశతునో । గోపాలచూడామణిః॥ . ౨౩

టీక॥ భక్తాపాయభుజఙ్గగారుడమణిః-భక్త - భక్తులయొక్క, అపాయ-కష్టములను, భుజఙ్గ-సర్పములకు, గారుడమణిః-శ్రేష్ఠమయిన గారుడ మంత్రమును, త్రైలోక్య...మణిః - త్రైలోక్య - ముల్లోకములయొక్క, రక్షా-కాపాడుటయందు, మణిః-శ్రేష్ఠుఁడును, గోపీలోచన చాతకామ్బుద మణిః-గోపీ గోపికలయొక్క, లోచన-కన్నులను, చాతక-వానకోయిలకు, అమ్బుదమణిః-కాఱుమేఘమయినవాఁడును, సౌన్దర్య ముద్రామణిః-అంద మునకు దృఢమైన ముద్రయైనవాఁడును, —కాన్తామణి-స్త్రీలలో నుత్తమురాలయిన, రుక్మిణీ-రుక్మిణీదేవియొక్క, ఘన-గొప్పవైన, కుచద్వన్ద్వ-చన్నులజంటకు, ఏక-ముఖ్యమైన, భూషామణిః-శ్రేష్ఠమైన ఆభరణప్రాయమయినవాఁడును, దేవశిఖామణిః-దేవతలకు శిరోభూషణ మయినవాఁడును, గోపాలచూడామణిః-గొల్లలలో శ్రేష్ఠుఁడున్నైనవాఁడు, యః-ఎవఁడో, సః-ఆ శ్రీకృష్ణుఁడు, శ్రేయః-సంపదను, దిశతు-ఇచ్చునుగాత.

తా॥ భక్తుల అపాయముల నెడి సర్పములను గరుడమంత్రమువలె బోఁగొట్టువాఁడును, ముజ్జగములను రక్షించుమేఁటియు, చాతకపక్షులను వర్షాకాల మేఘము సంతోషపఱచునట్లు, గోపికల నేత్రము లను సంతోషపఱచువాఁడును, సౌందర్యరాశియు, రుక్మిణీదేవిని గాఢా

లింగనము చేసికొనియుండువాఁడును, దేవతాశ్రేష్ఠుఁడును - యాదవ శిరో రత్నంబునైన శ్రీకృష్ణుఁడు సకలసంపదలను మాకు నిచ్చుఁగాత.

✓ శ్లో॥ శత్రుచ్ఛేదైకమన్త్రం । సకలముపనిషద్వాక్యసమ్పూజ్యమన్త్రమ్
సంసారోత్తారమన్త్రం । సముపచితతమస్సఙ్ఘ నిర్యాణమన్త్రమ్
సర్వైశ్వర్యైకమన్త్రం । వ్యసనభుజగసందష్టసన్త్రాణమన్త్రమ్
జిహ్వేశ్రీకృష్ణమన్త్రం । జపజపసతతం జన్మసాఫల్యమన్త్రమ్॥ ౨౮

టీక॥ హేజిహ్వే-ఓ నాలుకా, శత్రుచ్ఛేదైకమన్త్రం-శత్రుసంహారమునందు ప్రధానమంత్రమును, సకలం-సంపూర్ణముగా, ఉపనిషద్వావాక్య-వేదాంతవాక్యములలో, సమ్పూజ్య-గౌరవింపదగిన, మన్త్రం-మంత్రమును, సంసా...మన్త్రం—సంసార-సంసారమునుండి, ఉత్తార-తరింపఁజేయునట్టి, మన్త్రం-మంత్రమును, సముపచిత...మన్త్రం—సముపచిత-ప్రోగుచేయఁబడిన, తమః-అజ్ఞానమను చీకటియొక్క, సఙ్ఘ-రాశిని, నిర్యాణ-పోగొట్టదగిన, మంత్రం-మంత్రమును, సర్వ...మన్త్రం, సర్వైశ్వర్య-అన్నియైశ్వర్యములకు, ఏక-ముఖ్యమయిన, మన్త్రం-మంత్రమును, వ్యసన...మన్త్రమ్, వ్యసన-దుఃఖములను, భుజగ-పాములచేతను, సందష్ట-చక్కఁగా కఱవఁబడినవారిని, సన్త్రాణ-సంరక్షణచేయు, మన్త్రం-మంత్రమును, జన్మసాఫల్యమన్త్రమ్-జన్మమునకు సాఫల్యమును గలుఁగఁజేయు మంత్రమును అగు, శ్రీకృష్ణమన్త్రం-శ్రీకృష్ణఅను మంత్రమును, సతతం-ఎల్లప్పుడును, జపజప-పల్మాఱుజపముచేయుము॥ *

తా॥ శత్రు సంహారకమయినదియు, ఉపనిషత్తులలో మిక్కిలి శ్రేష్ఠముగా ప్రతిపాదితమయినదియు, సంసారమునుండి లేవఁదీయునదియు, అజ్ఞానమను నంధకారమును బోఁగొట్టునదియు, సకలసంపదల నిచ్చునట్టి మంత్రమును, సప్తవ్యసనములను పాములచే కఱవఁబడినవారిని కాపాడెటి మంత్రమును, జన్మసాఫల్యము గలుగఁజేయునట్టిదియు అగు శ్రీకృష్ణయను మంత్రమును ఓ నాలుకా నీవెల్లప్పుడు జపముచేయుచుండుము.

శ్లో॥ వ్యామోహ ప్రశమౌషధంమునిమనో । వృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేన్ద్రార్తికరౌషధంత్రిజగతాం । సఞ్జీవనైకౌషధమ్

---

* సకలం అను క్రియా విశేషణమును జన్మసాఫల్య మంత్రమను దానికి పూర్వమందైనను అన్వయించవచ్చును.

భక్తాత్యన్తహితౌషధంభవభయ । ప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధంపిబ మన । శ్రీకృష్ణదివ్యౌషధమ్॥ ౨౫॥

టీక॥ మనః-ఓమనసా, వ్యామోహప్రశమ ఔషధం—అను రాగ మనెడు మూర్ఛను, ప్రశమ-పోగొట్టునట్టి, ఔషధం-మందును, ముని... ధం—ముని-యోగులయొక్క, మనోవృత్తి - మనోవ్యాపారముయొక్క, ప్రవృత్తి-నడవడికి, ఔషధం-మందును, దైత్యేంద్ర...షధం—దైత్యేంద్ర-రాక్షసులమేటులకు, ఆర్తికర-బాధనుగలుగఁజేయునట్టి, ఔషధం-మందును, త్రిజ...షధం—త్రిజగతాం-ముల్లోకములను, సంజీవన-బ్రతికించునట్టి, ఏకౌషధం-ముఖ్యమయిన మందును, భక్త...షధం—భక్త-సేవ చేయువారికి, అత్యన్త-మిక్కిలి, హిత-మేలును గలుగఁజేయునట్టి, ఔషధం-మందును, భవ...షధం—భవ-సంసారమువలని, భయ-వెఱపును, ప్రధ్వంసన-బొత్తిగా లేకుండఁజేయునట్టి ఏకౌషధం-ముఖ్యమయినమందును, శ్రేయఃప్రాప్తికరౌషధం- మేలును పొందఁజేయునట్టి మందును అగు, శ్రీకృష్ణదివ్యౌషధం-శ్రీకృష్ణుఁడను శ్లాఘ్యమైనమందును, పిబ - పానము చేయుము,

తా॥ అజ్ఞానమును బోగొట్టునట్టిదియు, మునీంద్రులయొక్క మనోవ్యాపారములను ఇతరత్రప్రసరింపకతనయందె ప్రవర్తించునట్లు జేయునట్టిదియు, అసురులకు బాధను గలుగఁజేయునదియు, మూడులోకములను బ్రతికించునదియు, భక్తులకు మిక్కిలి మేలుగలుగఁజేయునదియు, సంసారమునందలి భయమును బోఁగొట్టునదియు, మోక్షప్రాప్తికాధారమయినదియునగు శ్రీకృష్ణ పరమాత్మయను దివ్యమయిన ఔషధమును పానము చేయుము॥

శ్లో॥ ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం । వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ । స్సర్వేహుతంభస్మని
* తీర్థానామవగాహ నానిచ గజ । స్నానం వినాయత్పద
ద్వన్ద్వామ్భోరుహసంస్మృతింవిజయతే। దేవస్సనారాయణః॥ ౨౬॥

టీక॥ యత్...సంస్మృతింవినా, యత్ -ఏనారాయణమూర్తియొక్క,

* తీర్థానాం-గంగాదిపుణ్యతీర్థములలో, అవగాహనాని-స్నానము చేయుటయు, గజస్నానం-ఏనుఁగు మునుక వేసినట్లో॥

పదద్వన్ద్వామ్భోరుహ-కమలములవంటి రెండుపాదములయొక్క, సంస్మృతింవినా-ధ్యానంబులేక, ఆమ్నాయాభ్యసనాని-వేదపాఠములు, అరణ్యరుదితం-అడవిలోనేడ్చుటవంటివో, అన్వహం-ప్రతిదినమును (చేయబడునట్టి), వేదవ్రతాని-వేదమునందుఁజెప్పఁబడిన వ్రతములు, మేదశ్ఛేదఫలాని-క్రొవ్వుతగ్గిపోవుట ఫలముగాఁగలవో, సర్వే-సమస్తములైన, పూర్తవిధయః-గుంటలు కోనేళ్ళు మొదలగునట్టి ధర్మకార్యములు, భస్మని-బూడిదలో, హుతం-హోమముచేయుటవంటివో, తీర్థానాం - గంగాదిపుణ్యనదుల యొక్క, అవగాహనానిచ-స్నానంబులును, గజస్నానం-ఏనుగయొక్క స్నానమువంటివో, సః, దేవః, నారాయణః-ఆభగవంతుఁడగు శ్రీవిష్ణుమూర్తి, విజయతే-ప్రకాశించుచున్నాఁడు॥

తా॥ హరిపద ధ్యానంబులేక చేయఁబడినవేదాధ్యయనములు అరణ్యరోదన ప్రాయంబులు, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు దేహము నఁగల కండనుఁబోగొట్టునట్టివే, గుంటలు, కోనేళ్ళు మొదలగునవి త్రవ్వుటలును బూడిదెలోఁజేసినహోమమువంటివి. గంగాదిపుణ్యనదీ తీర్థాదులందు స్నానముచేయుట ఏనుఁగు మునుకవేయుటవంటిది గనుక పైజెప్పబడిన వేదాభ్యాస గంగాస్నానాదికర్మలెల్లను హరిస్మరణపూర్వకముగనే చేసినట్లైన ఆయాఫలముల నిచ్చుచున్నవనియు హరిస్మరణను వదలిచేసిన కర్మలెల్లను వ్యర్థములనియు ముఖ్యాభిప్రాయము. కావున హరిస్మరణ పూర్వకముగనె కర్మలనుచేయవలయునని తేటబడినది॥

శ్లో॥ శ్రీమన్నామప్రోచ్య నారాయణాఖ్యం।
కేనప్రాపుర్వాఞ్ఛితం పాపినోపి।
హా నఃపూర్వంవాక్ప్రవృత్తానతస్మిన్।
తేనప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్॥ ౨౭॥

టీక॥ పాపినోఽపి-పాపాత్ములయినను, కే-ఎవరు, నారాయణాఖ్యం-నారాయణఅనునట్టి, శ్రీమత్-సకలసంపద్యుక్తమయిన, నామ-పేరును, ప్రోచ్య-కీర్తించి, వాఞ్ఛితం-ఇష్టమును, నప్రాపుః-పొందలేదు? అనగా అందరు పొందియున్నారు. పూర్వం-పూర్వజన్మమునందు, నః-మనయొక్క వాక్-వాగింద్రియము, తస్మిన్-ఆనారాయణ అనునామమునందు, నప్ర

వృత్త్యా-ప్రవేశింపలేను, తేన-ఆకారణముచేత, గర్భవాసాదిదుఃఖమ్-గర్భములోనుండుట మొదలగువానివలనగల్గినదుఃఖము, ప్రాప్తం-తటస్థించినది, హా-అయ్యో॥

తా॥ ఎంతపాపాత్ముఁడైనను భగవన్నారాయణ స్మరణచేసినయెడల, సకలములయిన యిష్టంబులును నెఱవేఱును. నేను పూర్వజన్మంబున భగవంతుని నామస్మరణచేయని దోషమువలననే, యీగర్భవాసము మొదలగు దుఃఖములు సంభవించినవి. అయ్యో, గడచిన జన్మమున నేను భగవన్నామస్మరణచేయకపోతినే అని తాత్పర్యము॥

శ్లో॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ ।
త్వద్భృత్య భృత్యపరిచారక భృత్యభృత్య
భృత్యస్యభృత్య ఇతిమాంస్మరలోకనాథ॥

టీక॥ హేమధుకైటభారే-ఓమధుకైటభులను రాక్షసులకు శత్రువయినవాఁడా, మజ్జన్మనః-నాయొక్క పుట్టుకకు, ఇదం-ఇది, ఫలం-ప్రయోజనము, మత్ప్రార్థనీయ...గ్రహః, మత్ -నాచేతను, ప్రార్థనీయ-కోరఁదగిన, మత్ -నావిషయమయిన, అనుగ్రహః-అనుగ్రహము, ఏషఏవ-ఇదే, హేలోకనాథ-ఓ లోకాధిపతీ, మాం-నన్ను, త్వత్ ...భృత్యఇతి, త్వత్ -దేవరవారి, భృత్య-పరిచారకునియొక్క, భృత్య-పరిచారకునియొక్క, పరిచారక-భృత్యునియొక్క, భృత్య-పరిచారకునియొక్క, భృత్య-పరిచారకునియొక్క భృత్యస్య-పరిచారకునియొక్క, భృత్యఇతి-సేవకుఁడని, స్మర-తలంచుము॥

తా॥ ఓ మధుకైటభారీ; దాసుఁడు జన్మమెత్తినందుకై చేయునట్టి ప్రార్థనయిదే. దేవరవారు దాసునివిషయమై యనుగ్రహింపవలసినదియు ఇదియే, ఓలోకనాథా, దేవరవారి సేవక కోటిలోమిక్కిలి తక్కువయిన సేవకునిగాఁ దాసునిదలంపవలయు॥

శ్లో॥ నాథేనః పురుషోత్తమే త్రిజగతా । మేకాధిపే చేతసా
సేవ్యేస్వస్య పదస్యదాతరిపరే । నారాయణేతిష్ఠతి
యంకంచిత్పురుషాధమం కతిపయ । గ్రామేశ మల్పార్థదం
సేవాయైమృగయామహేనరమహోమూఢావరాకావయం॥ ౨౯

టీక॥ నః-మనకు, నాథే-ప్రభువును, త్రిజగతాం-మూడులోకము

లకు, ఏకాధిపే-ముఖ్యమయినపాలకుఁడును, చేతసా-మనస్సుచేతను, సేవ్యే-కొలువఁదగినవాఁడును, స్వస్య-తనదైన, పదస్య-స్థానమును (వైకుంఠమును) దాతరి-ఇచ్చువాఁడును, పురుషోత్తమే-పురుషశ్రేష్ఠుఁడును, పరే-ప్రకృతికంటె పరమందుండువాఁడుననగు, నారాయణే-శ్రీమన్నారాయణమూర్తి తిష్ఠతిసతి-ఉండగా, కతిపయగ్రామేశం-కొన్నిగ్రామములకు ప్రభువయినవాఁడును, అల్పార్థదం-స్వల్పమయిన ధనమునుఇచ్చువాఁడును, పురుషాధమం-పురుషులలో నధముడైనవాఁడుననగు, యంకంచిత్ నరం-ఎవనినో ఒకమర్త్యుని, సేవాయై-కొలువుకొఱకు, మృగయామహే-వెదకుచున్నాము, అహో-అయ్యో, వయం-మనము, మూఢాః-మూఢులము, వరాకాః-పనికిమాలినవారము॥ *

తా॥ మనకందఱికి ప్రభువైనవాఁడును, పురుషోత్తముఁడును, ముల్లోకములకు నేకచ్ఛత్రాధిపతియు, మనసుచేతను కొలువఁదగినవాఁడును, తనస్థానమునే యిచ్చువాఁడును, ప్రకృతినిమీరినవాడుననగు శ్రీమన్నారాయణమూర్తియుండఁగా, పురుషాధముఁడును. ఏవో కొన్ని చిన్నపల్లెలకు పాళెగాఁడును,కూటికి చాలిచాలకయుండునట్లు డబ్బిచ్చువాఁడును, మనుష్యప్రాయుఁడునగు నొక యనామధేయుని కొలువుచేయుటకై వెదకుచున్నామే, అయ్యో; మనమెంతమూఢులము; ఎంతపనికిమాలినవారము॥

శ్లో॥ మదనపరిహరస్థితిం మదీయే
మనసిముకుందపదారవిన్దధామ్ని ।
హరనయనకృశానునాకృశోసి
స్మరసి నచక్రపరాక్రమంమురారేః॥ ౩౦॥

టీక॥ హేమదన-ఓమన్మథుఁడా; ముకుంద... ధామ్ని,ముకుంద-విష్ణువుయొక్క, పదారవిన్ద-కమలములవంటి పాదములకు, ధామ్ని-స్థానమయినట్టి, మదీయే-నాదయిన, మనసి-మనస్సునందు, స్థితిం-బసచేయుటను, పరిహర-విడిచిపెట్టుము,(త్వమ్-నీవు)హర...నునా, హర-ఈశ్వరునియొక్క, నయన-తృతీయనేత్రముయొక్క, కృశానునా-అగ్నిచేతను, కృశః-సన్నగిం

* ఇచ్చట మూకావరాకావయం అని పాఠాంతరముగలదు అప్పుడు మూకాః, నోరు చెవులుఉండియు మూగవారివలె ఉపయోగము లేనివారమని యర్థము.

చినవాఁడవు (బూడిదెయైనవాఁడు) అసి-అగుచున్నావు, మురారేః-(శ్రీకృష్ణునియొక్క, చక్రపరాక్రమం-సుదర్శనమను చక్రముయొక్క బలిమిని, నస్మరసి-తలంపవు.

తా॥ ఓ మన్మథుఁడా, ముకుందుని కమలములంబోలిన పాదములకు స్థానమగు నాహృదయమునందు నీవుండకుము. రుద్రుని నేత్రాగ్నిచేతనే గాల్పఁబడితివి. అతని తాతయగు మురరిపువగు నారాయణమూర్తి నా హృదయమున నివసించియున్నాడు అతని చక్ర పరాక్రమంబుఁ దలంపవైతివి వెంటనే విడిచిపొమ్ము.

శ్లో॥ తత్త్వంబ్రువాణానిపరంపరస్మాత్ । మధుక్షరన్తీవసతాంఫలాని ।
ప్రావర్తయప్రాఞ్జలి రస్మిజిహ్వే । నామానినారాయణగోచరాణి॥౩౦॥

టీక॥ హేజిహ్వే-ఓనాలుకా, పరస్మాత్-ఉత్తమమయినదానికంటె, పరం-ఉత్తమమయిన, తత్త్వం-సత్యవస్తువును, బ్రువాణాని-చెప్పుచుండునవియు, సతాం-సత్పురుషులకు, మధు-తేనెను, క్షరన్తి-కార్చునట్టి, ఫలానీవ-పండ్లవలెనుండునట్టివియునగు, అథవా-మధుక్షరంతీవ, మకరందమును స్రవింపుచున్నవో యన్నట్లునుండునవియు, సతాం ఫలాని-సత్పురుషులకు, స్వతః-ఫలరూపములుఅనునట్టి, నారాయణగోచరాణి-విష్ణువునకు సంబంధించిన, నామాని-పేళ్ళను, ప్రావర్తయ-వల్లించుము, (అహం-నేను), ప్రాఞ్జలిః-అంజలిచేయువాఁడను, అస్మి-అగుచున్నాను॥

తా॥ ఓనాలుకా, పరాత్పరుఁడగు పరబ్రహ్మను దెల్పునట్టివియు, సజ్జనులకు మకరందము నిచ్చు పండ్లవలె నుండునవియునగు (నారాయణ) (నారాయణ) యను నామమును పలుమాఱుచ్చరింపుము. నీకు నేను చెయిమోడ్చి మ్రొక్కుచున్నాను.

* శ్లో॥ ఇదంశరీరం పరిణామపేశలం । పతత్యవశ్యం శ్లథసంధిజర్ఝరమ్
కిమౌషధైః క్లిశ్యసి మూఢదుర్మతే । నిరామయం కృష్ణరసాయనం పిబ॥ ౩౧॥

---

* క్లిశూఁఉపతాపే అను దైవాదికాత్మనే పది ధాతువు అనుదాత్తేత్త్వ ప్రయుక్తమాత్మనేపదమనిత్యం అను మార్గమునుపట్టి పరస్మైపదిగా ప్రయోగింపబడినది.

టీక॥ ఇదంశరీరం-ఈ నశించెడు స్వభావముగల దేహము, పరిణామ పేశలం-పరిణామ-ముదిమిచేతను, పేశలం-మృదువైనదై, శ్లథ...రం— శ్లథ-వీడినట్టి, సన్ధి-కీళ్లుగలదిగనుక నే జర్ఝరమ్-వదులైనట్టిదై, అవశ్యం-తప్ప కుండ, పతతి-భూమిపైనఁబడిపోవుచున్నది, హేమూఢ-జ్ఞానములేనివాఁడా, దుర్మతే-దుష్టబుద్ధిగలవాఁడా, ఔషధైః-మందులచేతను, కిమ్-ఏల, క్లిశ్యసి-కష్టపడుచున్నావు, నిరామయం-ఆరోగ్యకరమయిన, కృష్ణరసాయనమ్-కృష్ణుఁడనురసాయనమును, పిబ-పానముచేయుము॥

తా॥ ఈశరీరము వార్ధకముచే రానురాను కృశించి, కీళ్ళుకీళ్ళువీడి కడపట నశించిపోవుచున్నది గనుక, ఏల ఊరకమందులు తీసికొని కష్టప డుచున్నావు. శ్రీకృష్ణ అనురసాయనమును పానముచేయుము॥

శ్లో॥ దారావారాకరవరసుతా । తేతనూజోవిరిఞ్చ
స్తోతా వేదస్తవసురగణో । భృత్యవర్గఃప్రసాదః ।
ముక్తిర్మాయా జగదవికలం । తావకీ దేవకీ తే
మాతామిత్రం బలరిపుసుత । స్తత్త్వదన్యంనజానే॥ 33॥

టీక॥ వారాకరవరసుతా-సముద్రములలోమేటియైన పాలుకడలి పట్టి లక్ష్మీదేవి, తే-నీయొక్క, దారాః-ప్రియురాలు, విరిఞ్చః-బ్రహ్మ, తే-నీకు, తనూజః-కొమారుఁడు, వేదః-ఋగ్యజుస్సామాధర్వణవేదములు, స్తోతా-స్తుతిపాఠకుడు,(బట్టువాఁడు.)సురగణః-దేవతాసమూహము, తవ-నీ యొక్క, భృత్యవర్గః-పరిచారకులగుంపు, ముక్తిః-మోక్షము, ప్రసాదః-నీయ నుగ్రహము, అవికలం సమస్తమైన, జగత్-ప్రపంచము, తావకీ-నీదియగు, మాయా-ప్రకృతి, దేవకీ-దేవకీదేవి, తే-నీయొక్క, మాతా-తల్లి, బలరిపు సుతః-అర్జునుఁడు, తే-నీయొక్క, మిత్రం-స్నేహితుఁడు, తత్-అందువల్ల, త్వదన్యం-నీకంటెమఱియొక్క దైవమును, నజానే-గుర్తెఱుఁగను॥

తా॥ లక్ష్మీదేవి నీభార్య, బ్రహ్మనీకు పుత్రుఁడు, వేదమునిన్ను స్తోత్రముచేయుచున్నది. నీభృత్యులు దేవతాసమూహము - మోక్షమె నీయనుగ్రహము. సకలప్రపంచము-నీమాయయే నీతల్లి దేవకీదేవి. నీచెలి కాఁడర్జునుఁడు. కనుకనీవు ఇంతటివాఁడైనందున నీకంటె మఱియొకదైవ మును నేనుతలచను॥

శ్లో॥ కృష్ణోరక్షతునోజగత్త్రయగురుః। కృష్ణంనమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః। కృష్ణాయతస్మైనమః।
కృష్ణాదేవసముత్థితం జగదిదం। కృష్ణస్యదాసోస్మ్యహం
కృష్ణేతిష్ఠతిసర్వమేతదఖిలం। హేకృష్ణరక్షస్వమామ్॥ 34॥

టీక॥ జగత్త్రయగురుః-మూడులోకములను పాలించునట్టి, కృష్ణః-శ్రీకృష్ణుఁడు, నః-మనలను, రక్షతు-కాపాడునుగాక, అహం-నేను, కృష్ణం-శ్రీకృష్ణమూర్తిని, నమస్యామి- నమస్కరించుచున్నాను, కృష్ణేన-శ్రీకృష్ణుని చేత, అమరశత్రవః-దేవతలకు పగవారగు రాక్షసులు, వినిహతాః-చంపఁబడిరి, తస్మైకృష్ణాయ-ఆకృష్ణునికొఱకు, నమః-దండము, కృష్ణాదేవ-కృష్ణునివలననే, ఇదంజగత్ - ఈలోకమంతయు, సముత్థితం - పుట్టినది, అహం-నేను, కృష్ణస్య-శ్రీకృష్ణునికి, దాసః-సేవకుఁడు, అస్మి-అగుచున్నాను. కృష్ణే-శ్రీకృష్ణమూర్తియందు, సర్వం-ఏతత్, ఈప్రపంచమంతయు, అఖిలం-నశింపకుండ, తిష్ఠతి - వున్నది, హేకృష్ణ - ఓకృష్ణా, స్వమామ్-నీసొత్తైననన్ను, రక్ష-కాపాడుము.

తా॥ మూఁడులోకములకు గురువును, రాక్షస సంహారకుఁడును, జగత్తుకంతకు కారణభూతుఁడును, జగద్రక్షకుఁడును నగు శ్రీకృష్ణునికి నమస్కారము చేయుచున్నాను. ఓ కృష్ణమూర్తీ నన్ను నీవు కాపాడుము.

శ్లో॥ తత్త్వంప్రసీదభగవన్ కురుమయ్యనాథే
విష్ణోకృపాంపరమకారుణికఃకిలత్వమ్।
సంసారసాగరనిమగ్నమనన్తదీన
ముద్ధర్తుమర్హసిహరే పురుషోత్తమోసి॥ 35॥

టీక॥ హేభగవన్ - ఓభగవంతుఁడా, తత్-అందువల్ల, ప్రసీద-నాయందు కోపరహితచిత్తుడవు కమ్ము, హేవిష్ణో-ఓవిష్ణువా, అనాథే-దిక్కులేని, మయి-నాయందు కృపాం, దయను-కురుచేయుము (ఉంచుము) త్వమ్-నీవు, పరమకారుణికఃకిల-దయావంతుడవుకదా, హేహరే - ఓహరీ, (హేఅనన్త-ఓనాశరహితుడా), సంసారసాగరనిమగ్నం - సంసారమనెడు

---

* ఇచ్చట రక్షధాతువు పరస్మైపది గావున రక్షస్వ అని భ్రమపడకూడదు. స్వశబ్దమును హేకృష్ణ అని దానికి విశేషణమునుచేసి, ఓ నా కృష్ణాయని యయినను చెప్పవచ్చును.

సముద్రమునందు మునిఁగినవాఁడును, అనన్తదీనం-మిక్కిలి దీనుఁడునగు, మాం-నన్ను, ఉద్ధర్తుం-లేవదీయుటకు, అర్హాసి-తగియున్నావు, త్వం-నీవు, పురుషోత్తమః-పురుషులలో శ్రేష్ఠుఁడవు, అసి-అగుచున్నావు.

తా॥ ఓభగవంతుఁడా, ఓహరీ, ఓవిష్ణూ, ఓపురుషోత్తమా, నీవు మిక్కిలి దయాపరుఁడవు గనుక, నీవు నాయెడల ననుగ్రహముంచి సంసార సాగరమునందు మునిఁగియుండు మిక్కిలి దీనుఁడనైన నన్ను లేవఁదీయుము.

శ్లో॥ నమామినారాయణ పాదపఙ్కజం
కరోమినారాయణ పూజనంసదా ।
వదామినారాయణనామ నిర్మలం
స్మరామినారాయణ తత్త్వమవ్యయమ్॥ ౩౬

టీక॥ అహం-నేను, నారాయణ పాదపఙ్కజం - శ్రీనారాయణ మూర్తియొక్క కమలములవంటి పాదములను, నమామి-నమస్కారము చేయుచున్నాను, సదా-ఎల్లప్పుడు, నారాయణపూజనం - విష్ణుపూజను, కరోమి-చేయుచున్నాను, నిర్మలం-దోషరహితమైన, నారాయణనామ-శ్రీనారాయణుని నామమును, వదామి-చెప్పుచున్నాను, అవ్యయం-నాశరహితమయిన, నారాయణతత్త్వం-విష్ణుడను పరతత్వమును, స్మరామి-తలంచుచున్నాను.

తా॥ శ్రీమన్నారాయణుని పాదపంకజములకుఁ బ్రణమిల్లుచు సర్వదా భగవంతుని పూజసేయుచు, నారాయణ నామోచ్చారణంబును చేయుచు, పరబ్రహ్మ స్వరూపియగు నారాయణమూర్తినే ధ్యానించుచున్నాను.

శ్లో॥ శ్రీనాథనారాయణ వాసుదేవ । శ్రీకృష్ణభక్తప్రియ చక్రపాణే
శ్రీపద్మనాభాచ్యుతకైటభారే । శ్రీరామపద్మాక్షహరేమురారే ॥౩౭॥

టీ॥ హేశ్రీనాథ-శ్రీవల్లభా, హేనారాయణ-జలశాయియయియుండువాఁడా, హేవాసుదేవ-ఓ వసుదేవుని పుత్రుఁడా, హేశ్రీకృష్ణ-ఓకృష్ణా, హేభక్తప్రియ-ఓభక్తులకిష్టుఁడయినవాఁడా, హేచక్రపాణే-సుదర్శనంబను చక్రంబును చేతధరించినవాఁడా, హేశ్రీపద్మనాభ-ఓపద్మనాభా, హే అచ్యుత-ఓనాశరహితమయినవాఁడా, కైటభారే-కైటభుఁడను రక్కసుని సంహరించినవాఁడా, హేశ్రీరామ-ఓశ్రీరామమూర్తీ, హేపద్మాక్ష - కమ

లములనుబోలిన కన్నులు గలవాఁడా, హేహరే - ప్రళయకాలమందు బ్రిహ్మరుద్రాదులనందఱిని హరించువాఁడా, హేమురారే – ఓమురాంతకుఁడా॥

తా॥ ఓ శ్రీవల్లభా-ఓవసుదేవపుత్రుడా, ఓకృష్ణా-చక్రిమును ధరించినవాడా, కమలము నాభియందుగలవాఁడా, ఓ నాశరహితుడా, కైటభాసురుని సంహరించినవాడా, ఓ శ్రీరామమూర్తీ, కమలములవంటి నేత్రములు గలవాఁడా, ప్రళయకాలమందు బ్రిహ్మరుద్రాదుల హరించువాఁడా, ఓ మురాంతకుడా అని ధ్యానముచేయుచు బ్రహ్మస్వరూపియగు నారాయణమూర్తినే ధ్యానించుచున్నాను.

శ్లో॥ అనన్తవైకుణ్ఠ ముకున్దకృష్ణ । గోవిన్దదామోదరమాధవేతి
వక్తుంసమర్థోపినవక్తికశ్చి । దహోజనానాంవ్యసనాభిముఖ్యమ్॥౩౮

టీక॥ హేఅనన్త-ఓతుదలేనివాఁడా, హేవైకుణ్ఠ - ఓవైకుంఠుఁడా, హేముకున్ద-ఓముకుందుఁడా, హేదామోదర-ఓదామోదరుఁడా, హేమాధవ-ఓలక్ష్మీవల్లభా, ఇతి-అని, వక్తుం-చెప్పుటకు, సమర్థోపి-శక్తిగలవాడైనను, కశ్చిత్-ఒకఁడైనను, నవక్తి-చెప్పఁడు, అహో-అయ్యో, జనానాం-మూఢులకు, వ్యసనాభిముఖ్యం - దుఃఖములయందలి యుత్సాహము॥

తా॥ శ్రీనాథనారాయణ అను మొదలగు శబ్దములచేతను, అనంత వైకుంఠ అను మొదలగు శబ్దములచేత, ఆభగవంతుని స్తోత్రిము చేయ శక్తుడైయుండినను, ఒకఁడైనను చేయుటలేదు. అయ్యో యీజనులకు సంసారమునందలి యాస ఆహా ఏమియాశ్చర్యము.

శ్లో॥ ధ్యాయన్తియేవిష్ణుమనన్తమవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్ ।
సమాహితానాం సతతాభయప్రిదం
తేయాన్తిసిద్ధిం పరమాంచవైష్ణవీమ్॥ ౩౯

టీక॥ యే-ఎవరు, అనన్తం-తుదిలేనివాఁడును, అవ్యయం-నాశరహితుఁడును, సతతం-ఎల్లప్పుడు, హృత్పద్మమధ్యే-యోగులయొక్క, మనస్సనెడు కమలముయొక్క-మధ్యమునందు, వ్యవస్థితం-ఉన్నవాఁడును, సమాహితానాం-తనయందు ఏకాగ్రిచిత్తులైనవారికి, సతతాభయప్రిదం-ఎల్లప్పుడు

అభయము నిచ్చువాఁడునగు, విష్ణుం-విష్ణువును, ధ్యాయన్తి-ధ్యానము చేయుచున్నారో, తే-వారు, పరమాంచ-ఉత్తమమున్నదైన, వైష్ణవీం-విష్ణుసంబంధియైన, సిద్ధిం-మోక్షమును, యాన్తి-పొందుచున్నారు.

తా॥ యోగుల హృదయారవిందముల మధ్యమున నెల్లప్పుడు సంచరించునట్టి, అనాద్యంతుఁడై నాశరహితుఁడయిన విష్ణువు నెవరు మ్రొక్కుచున్నారో వారు, శ్రీవైకుంఠంబును జేరుచున్నారు॥

శ్లో॥ క్షీరసాగరతరఙ్గశీకరా । సారతారకితచారుమూర్తయే ।
భోగిభోగశయనీయశాయినే । మాధవాయమధువిద్విషేనమః ౪౦

టీక॥ క్షీర...మూర్తయే, క్షీరసాగర - పాలసముద్రము నందలి, తరఙ్గ-అలలయొక్క, శీకర-తుంపురులయొక్క, ఆసార-ఎడతెగనివానచేతను తారకిత-ముత్యాలహారము ధరించినట్లుండు, చారు-అందమైన, మూర్తయె శరీరముగలవాఁడును, భోగి...శాయినే, భోగి-తిరువనందాళ్వారుయొక్క, భోగ-శరీరమనెడు, శయనీయ-పాన్పునందు, శాయినే-పరుండునట్టి వాడును మధువిద్విషే - మధువను రాక్షసుని సంహరించిన వాఁడును అయినట్టి, మాధవాయ-మాధవునికొరకు, నమః-ప్రణామములు॥

తా॥ పాల్కడలి యందలి యలల తుంపరల చేత వ్యాపింపఁబడియుండు శరీరము గలవాఁడును, తిరువనందాళ్వారులయొక్క అనగా ఆదిశేషులయొక్క తిరుమేనునందు పరుండువాఁడునగు మాధవుని కొరకు నమస్కారములు॥



ఇంకమీద

మనదేశ పుస్తకములందు కనబడక ఉత్తరదేశపు బాళుబందు
పుస్తకములందు అచ్చువేయ బడిన ముకుందమాల
శ్లోకములను టీకా తాత్పర్యములతో ముద్రించుచున్నారము

శ్లో॥ యత్కృష్ణప్రణిపాతధూళిధవళం । దత్వర్ష్మతద్వైశిర
స్తేనేత్రేతేతమసోజ్ఝితే సురుచిరే । యాభ్యాంహరిర్దృశ్యతే
సాబుద్ధిర్విమలేన్దుశఙ్ఖధవళా । యామాధవధ్యాయినీ
సాజిహ్వాఽమృతవర్షిణీప్రతిపదం। యాస్తౌతినారాయణమ్॥ ౧॥

టీక॥ కృష్ణప్రణిపాతధూళిధవళం- నారాయణునికిసాష్టాంగ ప్రణామము లాచరించుటవల్ల సంబంధించిన భూమియందుండు దుమ్ముతో తెల్లనైనది, యత్-యేదేహమో, తత్ వర్ష్మ-అదేదేహమన తగినది, తద్వైశిరః - కృష్ణప్రణిపాతధూళి ధవళమైనది యేఃశిరస్సో అదే శిరస్సు, యాభ్యాం-ఏనేత్రములచేత, హరిః-నారాయణమూర్తి, దృశ్యతే-చూడఁబడుచున్నాఁడో, తే-అట్టి, నేత్రే-కన్నులు, తమసా-అంధకారము అనగా అజ్ఞానముచే, ఉజ్ఝితే-విడువబడినవి, సురుచిరే-మిక్కిలి ప్రకాశించునవి. యాబుద్ధిః-ఏబుద్ధి, మాధవధ్యాయినీ-శ్రియఃపతిని ధ్యానించునో, విమలేన్దుశఙ్ఖధవళా-నిర్మలమైన చంద్రునివలె శంఖమువలె స్వచ్ఛమైనదో, సా-అదే, బుద్ధిః-బుద్ధి, యా-ఏనాలుక, నారాయణం - నారాయణమూర్తిని, ప్రతిపదం-మాటిమాటికి, స్తౌతి-స్తుతిజేయుచున్నదో, సా-అట్టి, జిహ్వా-నాలుక, అమృతవర్షిణీ-అమృతధారను గురిపించునట్టిది.

తా॥ భగవంతుని నమస్కరించు దేహమే దేహము, భగవంతునికి వందనముచేయు శిరస్సేశిరస్సు, భగవంతుని దర్శించు నేత్రములే నేత్రములు, భగవంతునిధ్యానించు బుద్ధియేబుద్ధి, భగవంతుని స్తుతిచేయునట్టి నాలుకే నాలుక, అనగా దేహేంద్రియాదులు సర్వములు భగవంతుని యందు ఉపయోగింప బడితేనే సార్థకములనుట॥

శ్లో॥ నాథేధాతరి భోగిభోగశయనే। నారాయణే మాధవే
దేవేదేవకినన్దనే సురవరే। చక్రాయుధేశార్ఙ్గిణి॥
లీలాశేషజగత్ప్రపఞ్చజఠరే। విశ్వేశ్వరేశ్రీధరే
గోవిన్దేకురుచిత్తవృత్తిమచలా। మన్యైస్తుకింవర్తనైః॥

టీక॥ నాథే-మనకు స్వామి అయిన, ధాతరి-పోషకుడైన, భోగి...నే, భోగి-ఆదిశేషుని, భోగ-దేహము, శయనే-పడకగాగల, నారాయణే-సర్వాంతర్యామియైన, సురవరే-దేవతాశ్రేష్ఠుడైన, చక్రాయుధే-సుదర్శనమనుచక్రము ఆయుధముగాగల, శార్ఙ్గిణి-శార్ఙ్గమను పేరుగల ధనస్సుగల, లీలా...రే-లీలా-లీలచేతను, అశేష-సమస్తములగు, జగత్-లోకములు, జఠరే-గర్భమందుగల, విశ్వేశ్వరే-సమస్త ప్రపంచమునకు అధిపతియైన, శ్రీధరే-లక్ష్మీదేవిని హృదయమందు ధరించిన, గోవిన్దే-గోవులకు రక్ష

కుడైన, మాధవె-మధు వంశమునందు పుట్టిన, దేవకినందనే - దేవకీదేవికి కుమారుడైన, దేవే-దేవునియందు, అచలాం-నిర్మలమగు, చిత్తవృత్తిం-మనోవృత్తిని, కురు-చేయుము, అన్యైః-ఇతరములగు, వర్తనైః-నడతలచేత కిం-ఏమిఫలము, ఈశ్లోకమునందు దేవకినందనే అనుహ్రస్వఘటితరూపము చింత్యము, అథవా దేవకినందన శబ్దసంజ్ఞ అనిభావించిన యెడల (జ్యాపో స్సంజ్ఞాచ్ఛన్దసోర్బహులమ్) అను సూత్రముచే సాధువు॥

తా॥ మనకు పోషకుడును శేషశాయియును, దేవతా శ్రేష్ఠుడును చక్రిమును శార్ఙ్గమును ధరించిన వాడును జగద్గర్భుడును జగన్నాయకుడును లక్ష్మీశభర్తయు గోరక్షకుడును అయిన మధువంశమునందుఁ బుట్టిన శ్రీకృష్ణమూర్తిని సర్వదా ధ్యానింపుము, ఇతర లౌకిక వ్యవహారములతో నీకేమియు ఫలముఁ కలగదు॥

శ్లో॥ శ్రీనాధనారాయణవాసుదేవ । గోవిన్దదామోదరచక్రపాణే
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే। కంసఘ్నపద్మాప్రియశార్ఙ్గపాణే॥

టీక॥ శ్రీనాథ-లక్ష్మీశపతీ, నారాయణ-జగత్ర్పళయమందు అఖండజలమందు వటపత్రిశాయిగా నుండెడివాడా, వాసుదేవ-సమస్తప్రపంచమునకు ఆధారభూతుడును సర్వజగదంతర్యామియు అయినవాడ, గోవిన్ద-గోవులను రక్షించువాడ, దామోదర-యశోదాదేవి రోటికి కట్టివేసిన సమయమందు, పగ్గము కడుపుయందుగలవాడ, చక్రపాణే-చక్రము హస్తమందుగలవాడా, పద్మనాభ-కమలము బొడ్డుయందు గలవాడా, అచ్యుత నాశరహితుడా, కైటభారే-కైటభుడను రాక్షసునికి శత్రువైనవాడా, కంసఘ్న-కంసుని సంహారించినవాడా, పద్మాప్రియ-లక్ష్మీశదేవికిప్రియుడైన వాడా, శార్ఙ్గపాణే-శార్ఙ్గమను పేరుగల ధనుస్సు హస్తమందుగలవాడా॥

శ్లో॥ అనన్తవైకుణ్ఠముకున్దరామ । జనార్దనానన్దనిరామయేతి
వక్తుంసమర్థోపి నవక్తికశ్చి । దహోజనానాంవ్యసనాభిముఖ్యమ్॥

టీ॥ అనన్త-కొనలేనివాడా, వైకుణ్ఠ- వైకుంఠమను లోకమునకు అధిపతియైనవాడా, ముకున్ద-మోక్షమునిచ్చువాడ, రామ-యోగులచేత ప్రేమపూర్వకముగా ధ్యానింపబడువాడ, ఆనన్ద - నిరతిశయానందస్వరూపుడ, (నిరతిశయానందము గుణముగాగలవాడ) నిరామయ-కర్మవశ్యుడు

కానందున రోగాదిజన్య దుఃఖగంధరహితుడ, ఇతి-ఈరీతిగా, వక్తుం-భగవన్నామములను అనుటకు, సమర్థోపి-శక్తిగలవాడైనను, కశ్చిత్-ఒకడైనను నవక్తి-అనడు, జనానాం-మనుష్యులకు, వ్యసనాభిముఖ్యం - దుఃఖములకు ఎదురునడుచుట, అహో-ఆశ్చర్యకరమైనది. ౩,౪ శ్లోకములకు తాత్పర్యము వ్రాశితే.

తా॥ సమస్త దుఃఖములను పోగొట్టి మహానందరూప మోక్షము నిచ్చెడి శ్రియఃపతేనారాయణ వాసుదేవ ఇత్యాది సులభముగా నుచ్చరించతగిన భగవన్నామములుండినను లోకమునందు ఒకడైనను ఉచ్చరింపడు. అయ్యో, ఈజనులకు దుఃఖములయందు ఎంత రుచియో తెలియదు, సులభమైన భగవన్నామములతో మోక్షము వచ్చుచుండగా అట్లుచేయనివాడు కావలెనని దుఃఖము తెచ్చుకున్నట్లే యనుట.

శ్లో॥ శ్రుత్వాజనార్దన। కథాగుణకీర్తనాని
దేహేనయస్య। పులకోద్గమరోమరాజిః।
నోత్పద్యతేనయనయో। ర్విమలాంబుధారా
ధిక్తస్యజీవితమహో। పురుషాధమస్య॥ ౫

టీక॥ జనార్దన...కీర్తనాని, జనార్దన-నారాయణునియొక్క, కథా-చరిత్రమును, గుణకీర్తనాని-అతనియొక్క గుణకీర్తనలను, శ్రుత్వా-విని తిష్ఠతః-ఉండెడి, యస్య-ఏపురుషునియొక్క, దేహే-దేహమందు, పులకో...రాజిః, పులకోద్గమ-పులకాంకురములనబడు, రోమరాజిః - రోమముల పఙ్క్తి-నభవతి-కలుగదో, నయనయోః-నేత్రములయందు, విమలా-పరిశుద్ధమైన, అమ్బుధారా-ఆనందబాష్పధార, నోత్పద్యతే-పుట్టదో, పురుషాధమస్య-మనుష్యులలో అధముడైనటువంటి, తస్య-వానియొక్క, జీవితం బ్రతుకునుగురించి, ధిక్-నింద, అహో-వానిజన్మము ఎంత నింద్యమైనది॥

తా॥ నారాయణుని కథను గుణములను విని యెవనికి దేహమందు పులకాంకురములు కలుగవో నేత్రములనుంచి ఆనంద బాష్పములు దుంకవో అట్టి భగవద్విముఖుడైన పురుషాధముని జన్మము వ్యర్థము॥

శ్లో॥ అన్ధస్యమేహృతవివేకమహాధనస్య
చోరైఃప్రభోబలిభిరిన్ద్రియనామధేయైః।

మోహాన్ధకూపకుహరే వినిపాతితస్య
దేవేశ దేహి కృపణస్య కరావలమ్బమ్॥ ౬॥

టీక॥ ప్రభో-జగత్ప్రభువైన నారాయణుఁడ, ఇన్ద్రియ - చక్షురాదీంద్రియములనెడు, నామధేయైః-పేరుగల, బలిభిః-బలిష్ఠులగు, చోరైః-దొంగలచేత, హృత...నస్య—హృత-అపహరింపబడిన, వివేక-నిత్యానిత్యవస్తు వివేకమనెడి, మహాధనస్య - గొప్పధనము కలిగినట్టియు, మోహాన్ధ...తస్య—మోహ - అజ్ఞానమనెడి, అన్ధకూప - అంధకారావృతమైన చేదెడి భావియొక్క, కుహరే-అగాధమగుగుంతలో, వినిపాతితస్య-పడవేయబడినట్టియు, కృపణస్య-దీనుడైనట్టి, మే-నాకు, కరావలమ్బం-హస్తమనెడిపట్టువస్తువును, అనగా హస్తాధారమును, దేహి-ఇమ్ము.

తా॥ ఇంద్రియవశ్యుడనై సద సద్వివేకమును పోగొట్టుకొని అజ్ఞానమను చీకటి బొందలో బడి విలవిల తనుకులాడుచుండెడి నన్ను నీహస్తముతో పైకి లేవనెత్తుము.

శ్లో॥ ఆశ్చర్యమేతద్ధి మనుష్యలోకే
సుధాంపరిత్యజ్య విషంపిబన్తి ।
నామాని నారాయణ గోచరాణి
త్యక్త్వాన్యవాచః కుహకాఃపఠన్తి॥ ౭॥

టీక॥ మనుష్యలోకే-భూలోకమందు, ఏతద్ధి-ఇది, ఆశ్చర్యం-ఆశ్చర్యకరమైనది, జనాః-మనుష్యులు, సుధాం-అమృతమును, పరిత్యజ్య-విడచి, విషం-కాలకూటవిషమును, పిబన్తి-త్రాగుచున్నారు, కుహకాః - అజ్ఞానబద్ధులు, నారాయణగోచరాణి - నారాయణవిషయకములైన, నామాని-నామములను, త్యక్త్వా-విడచి, అన్యవాచః-ఇతరములగు వాక్కులను, పఠన్తి-అభ్యసించుచున్నారు.

తా॥ నిరతిశయానందరూప మోక్షహేతువులగు భగవన్నామములను విడచి, దుఃఖరూప సంసారకారణములగు ఇతరవాక్కులను ఉచ్చరించు జనులను చూడగా, పీడు ఆకలిని తొలగించి మహానందమునిచ్చు అమృతమునువిడచి మహాదుఃఖకరమైన తత్కాలమందు మరణమునిచ్చు విషమును పానము చేయునట్టున్నది జనులు ఎంతటి యవివేకులు మనుష్యలోకమునందు ఇంతకంటె ఆశ్చర్యమేమి ఉన్నదనుట.

శ్లో॥ త్యజన్తు బాన్ధవాస్సర్వే । నిన్దన్తు గురవో జనాః
తథాపి పరమానన్దో । గోవిన్దో మమ జీవనమ్॥ ౭॥

టీక॥ సర్వే-సమస్తులగు, బాన్ధవాః - బంధువులు, మాం-నన్ను, త్యజన్తు-విడవనిగాక, మమ-నాయొక్క, గురవః - దేవతాంతరభక్తులైన వంశగురువులు, నిన్దన్తు-నిందించనిగాక, తథాపి-అయినప్పటికి, పరమానన్దః-నిరతిశయానందరూపుడగు, గోవిన్దః-నారాయణుడు, మమ-నాకు, జీవనమ్-ప్రాణమువంటివాఁడు, అనగా బ్రతుకు తెరువు.

తా॥ అనగా, జ్ఞానహీనులైన బంధువులు తమకు ఇష్టములేని క్రొత్తమార్గము నవలంభించినవాఁడనే హేతువుచే నన్ను విడచినను దేవతాంతరభక్తులగు ఇదివరకు ఉన్న గురువులు విష్ణుభక్తుఁడగు నన్ను చూచి నిందించినను, పరమానందరూపుఁడగు సాక్షాన్నారాయణుడు నాకు ప్రాణముగనుక అతనిని నేనెన్నటికి విడవను, అతనియందే నామనస్సు లగ్నమైనదనుట.

శ్లో॥ చేతశ్చిన్తయ కీర్తయస్వ రసనే । నమ్రీభవ త్వం శిరో
హస్తావఞ్జలి సమ్పుటం రచయతం । వన్దస్వ దీర్ఘం వపుః
ఆత్మన్ సంశ్రయ పుణ్డరీకనయనం । నాగాచలేన్ద్రస్థితం
ధన్యం పుణ్యతమం తదేవ పరమం । దైవం హి సంసిద్ధయే॥ ౮॥

టీక॥ చేతః-ఓమనస్సా, నాగా...తం - నాగాచలేన్ద్ర, హస్తిగిరియందు, అథవా-శేషగిరియందు, స్థితం-ఉండునట్టి, పుణ్డరీకనయనం-తెల్లకమలములవంటి నేత్రములుగల నారాయణుని, అనగా వరదరాజుని, అథవా వేంకటేశ్వరుని, చిన్తయ-ధ్యానముచేయుము, స్వరసనే-ఓనాలుకా, త్వం-నీవు, కీర్తయ - కీర్తింపుము, శిరః-ఓశిరస్సా, త్వం-నీవు, నమ్రీభవ-ఆదేవునికి మ్రొక్కుము, హస్తౌ-ఓచేతులార, అఞ్జలిసమ్పుటం - సంపుటాకారమగు అంజలిని, రచయతం-చేయుడు, వపుః-దేహమా, దీర్ఘం-దండాకారముగా, వన్దస్వ-సమస్కరింపుము, ఆత్మన్-ఓజీవుడా, సంశ్రయ-ఆశ్రయింపుము, ధన్యం-శ్రేష్ఠమైన, పుణ్యతమం-అతిపవిత్రమైన, తదేవ-ఆవెంకటేశ్వరుడే, సంసిద్ధయే-మోక్షముకొఱకు, పరమందైవంహి-పరదేవతగదా, 'సర్వనామాని ఉద్దేశ్యప్రతినిర్దేశ్యయోః పర్యాయేణలిఙ్గముపాదదతే' అను న్యాయముతో, 'శైత్యంహియత్సాప్రకృతిర్జలస్య' అనేరీతిగా దైవ

శబ్దప్రతిసంధానముతో, తదేవ-అనితచ్ఛబ్దము, నపుంసకముగా ప్రయోగింప బడినది.

తా॥ నారాయణుడు మోక్షమిచ్చెడి పరదేవతగనుక చింతన, కీర్తన, నమస్కారాంజలిబంధ, సాష్టాంగప్రణామభక్తి, ప్రపత్తులను మహానుభావుడగు ఆ నారాయణునియందే క్రమముగా సలుపుడు, అని చిత్త, రసనా, మస్తక, హస్త, దేహజీవాత్మలతో గ్రంథకర్త చెప్పుచున్నాడు.

శ్లో॥ సత్యంబ్రవీమిమనుజాస్స్వయమూర్ధ్వబాహు
ర్యోయోముకుందనరసింహజనార్దనేతి ।
జీవోజపత్యనుదినం మరణేరణేవా
పాషాణకాష్ఠసదృశాయదదాత్యభీష్టమ్॥ ౧౦॥

టీక॥ మనుజాః-ఓమనుష్యులార, స్వయం-నేను, ఊర్ధ్వబాహుః-ఎత్తబడిన బాహావు గలవాడనై, సత్యం-యథార్థమును, బ్రవీమి-చెప్పుచున్నాను, యఃయః - ఏప, జీవః - జీవుడు, అనుదినం - దినదినమందు, ముకుంద, నరసింహ, జనార్దన, ఇతి-ఈఅక్షరానుపూర్విని, జపతి-జపించునో, మరణే-స్వాభావికమరణసమయమందుగాని, రణేవా-యుద్ధమునందుగాని, పాషాణకాష్ఠసదృశాయ-మూర్ఛాదులచేత రాయికట్టెవలె పడియుండే పురుషునికొఱకు ఆ శ్రీమన్నారాయణుడు, అభీష్టం-మోక్షమును, దదాతి-ఇచ్చుచున్నాడు.

తా॥ ముకుంద, నరసింహ, జనార్దన, శ్రీమన్నారాయణ, శ్రియఃపతే, ఇత్యాదిరీతిగా జీవితకాలమంత అనుదినము భగవన్నామములను అనుసంధించు మహాపురుషుడు, ఒకవేళ మరణసమయమందుగాని యుద్ధకాలముయందుగాని కర్మవశమున మూర్ఛనొంది రాయికట్టవలె పడియుండి భగవంతుని స్మరింపజాలకయుండినను సాక్షాత్ ఆభగవంతుడే ఆ స్థితిలో నుండు ఆజీవునికి మోక్షమిచ్చుచున్నాడు. ఈయంశము సత్యమని నేను చెయ్యెత్తి దృఢముగా చెప్పగలననుట.

శ్లో॥ నారాయణాయనమఇత్యమమేవమన్త్రమ్
సంసారఘోరవిషనిర్హరణాయనిత్యమ్ ।
శృణ్వన్తుభవ్యమతయో యతయోనురాగా
దుచ్చైస్తరాముపదిశామ్యహమూర్ధ్వబాహుః॥ ౧౧॥

టీక॥ అహం-నేను, ఊర్ధ్వబాహుః-చెయ్యెత్తి, నిత్యం-నియతముగా సంసారఘోరవిషనిర్వారణాయ-సంసారమనెడి భయంకర కాలకూట విషమును పోగొట్టుటకు, నారాయణాయనమ ఇత్యము మేవమంత్రం - నారాయణాయనమః-అని అను పూర్విగల యిదే మంత్రమునే, ఉచ్చైస్తరాం-గట్టిగా, ఉపదిశామి - చెప్పుచున్నాను, భవ్యమతయః - మంచిబుద్ధిగల, యతయః-మోక్షైకనిష్ఠులు, అనురాగాత్-ప్రేమవల్ల, శృణ్వన్తు-విందురుగాక.

తా॥ నారాయణాయనమః అను నీమంత్రమే సంసారమును తప్పక పోగొట్టుచున్నది, కనుక ఇదే మంత్రమునే అందరికిని చెయ్యెత్తి గట్టిగా చెప్పుచున్నాను. జన్మాంతర పుణ్యములో పరిపక్వబుద్ధులైన మోక్షపరులందరు ఇదే మంత్రమునే విని జపించవలయును అనుట.

ఇచట స్త్రీశూద్రులు మొదలుకొని ముముక్షువులగు నాలుగు వర్ణములవారికి మోక్ష సాధక మంత్రమును ప్రదర్శింపవలెను గనుక సర్వులును ఉచ్చరింపతగిన మంత్రఖండమును మాత్రము ఇచ్చట నిర్దేశించియున్నారు. ఇతర ప్రమాణములను బట్టి ఆదియందు ప్రణవమును గాని సబిందు కారమునుగాని కలుపుకొని తమతమ అధికారానుగుణముగా సంపూర్ణమంత్రమును వారువారు జపించవలయును.

ఈ శ్లోకమందు యతిశబ్దమునకు తుర్యాశ్రమము (సన్యాసము) నాశ్రయించినవారని అర్థముకాదు, కింతు - ఐతే, ఉపరతచిత్తులని (వైరాగ్యముగలవారని) అర్థము. అందువలన ఇచట అహమహమికతో వచ్చు శంకలకు కొంచమైనను అవకాశము లేకపోయినది.

శ్లో॥ చిత్తంనైవనివర్తతేక్షణమపి । శ్రీకృష్ణపాదామ్బుజాత్
నిన్దన్తుప్రియబాన్ధవాగురుజనా । గృహ్ణన్తుముఞ్చన్తువా
దుర్వాదంపరిఘోషయన్తుమనుజా । వంశేకళఙ్కోస్తువా
తాదృక్ప్రేమభరానురక్తమిహమే । మత్తాయమానంమనః॥౧౨॥

టీక॥ మేచిత్తం-నామనస్సు, శ్రీ...జాత్-శ్రీకృష్ణుని కమలమువంటి పాదమునుంచి, క్షణమపి-నిమేషకాలమైనను, ననివర్తతే-వెనకకు తిరుగదు, ప్రియబాన్ధవాః-నెయ్యపుబంధువులు, నిన్దన్తు - నిందించనిగాక, గురుజనాః-దేవతాంతర భక్తులగు మాగురువులు, గృహ్ణన్తు ముఞ్చన్తువా-నన్ను స్వీకరిం

చిననుసరే, విడచిననుసరే, మనుజాః-ఇతరజనులందరు, దుర్వాదం-దుష్ట వాక్యములను, అథవా అపకీర్తిని, పరిఘోషయన్తు-వీధివీధియందు ప్రసరింపచేయనిగాక, కడపట, వంశే-మావంశమునందు, అస్తువాకలఙ్కః-నలుపుకలిగినను, సరే-ఇది, "పురోజన్మానాద్య ప్రభృతిమమరామస్వాయమహాంనపుత్రః పౌత్రోవామనుకులభువాంచక్షితిభుజాం" అనునట్లు నలుపు ఎన్నటికి కలగదనే దార్ఢ్యముతో చెప్పుమాట, తాదృక్ప్రేమభరానురక్తం-భగవంతునియందు అలవిగాని అనురాగభరముతో యుక్తమైన, మేమనః-నామనస్సు, ఇహ-ఈలోకమందు, మత్తాయమానం-మదించినది, అథవా-విషయాంతర జ్ఞానరహితమైయున్నది.

ఈ శ్లోకము గోపికలు శ్రీకృష్ణుని విషయకముగా చెప్పిన శ్లోకము. తనకును శ్రీకృష్ణునియందు వారివంటి అనురాగమే యున్నదని తెలుపుటకై అదే శ్లోకమునే శ్రీ కులశేఖరాళ్వార్ అనుసంధించినారని కొందరి అభిప్రాయము వారి మతమందు ఇహమేమత్తాయమానం, అనుచోట ఇహనోమత్తాయమానం అని పాఠము. నః-మాదియగు అని యర్థము.

శ్లో॥ ప్రణామమీశస్య శిరఃఫలంవిదుస్త
దర్చనంప్రాణిఫలందివౌకసః ।
మనఃఫలంతద్గుణ తత్త్వచిన్తనం
వచఃఫలం తద్గుణ కీర్తనంబుధాః॥ ౧౩॥

టీక॥ దివౌకసః-దేవతలు, బుధాః-పండితులును, ఈశస్య-భగవంతునిగురించి, ప్రణామం-నమస్కారమును, శిరఃఫలం-శిరస్సునకు ఫలముగా, విదుః-తెలియుచున్నారు, తదర్చనం-ఆ భగవంతుని అర్చించుటను, ప్రాణిఫలం-హస్తములకు ఫలముగాను, విదుః-తెలియుచున్నారు. తద్గుణతత్త్వచిన్తనం-ఆ భగవంతుని గుణములయొక్క యాథార్థ్యచింతనమును, మనఃఫలం-మనస్సునకు ఫలముగాను, విదుః-తెలియుచున్నారు, తద్గుణకీర్తనం-ఆ భగవంతుని గుణకథనమును, వచఃఫలం-వాక్కునకు ఫలముగాను, విదుః-తెలియుచున్నారు.

తా॥ శిరస్సుఉన్నదానికి భగవంతుని నమస్కరించితేనే సార్థకము. హస్తములున్నందుకు భగవంతుని అర్చించితేనే సార్థకములు, మనస్సు ఉన్నందుకు ఆ భగవద్గుణచింతనము సలిపితేనే సార్థకము, వాక్కు

ఉన్నందుకు ఆ భగవద్గుణములను కీర్తించితేనే సార్థకము.

శ్లో॥ అలమలమలమేకా ప్రాణినాంపాతకానాం
నిరసనవిషయేయా కృష్ణకృష్ణేతివాణీ।
యదిభవతిముకున్దే భక్తిరానన్దసాన్ద్రా
కరతలకలితాసామోక్షసామ్రాజ్యలక్ష్మీః॥ ౧౪॥

టీక॥ కృష్ణకృష్ణేతి-కృష్ణకృష్ణఅనెడు, యావాణీ-ఏవాక్కుగలదో, సా-ఆవాక్కు, ప్రాణినాం - చేతనులయొక్క, పాతకానాం - పాపముల యొక్క, నిరసనవిషయే-పోగొట్టుట అనే విషయమందు, అలమలమలం-చాలును చాలును చాలును, ముకున్దే - నారాయణునియందు, ఆనన్దసాన్ద్రా - సంతోషముచేనిండిన, భక్తిః - భక్తి, యదిభవతి - అయినట్టాయనా, సా-ఆ మోక్షసామ్రాజ్యలక్ష్మీః-మోక్షరాజ్యలక్ష్మి, కరతల కలితా-అరచేతిలో నుండునదిగా అగుచున్నది.

తా॥ కృష్ణకృష్ణయను భగవన్నామము ప్రాణుల సమస్తపాపములను నిస్సంశయముగా పోగొట్టును, సాక్షాన్నారాయణమూర్తియందు భక్తిగలిగితే మోక్షము అరచేతిలో నుండును, అనగా సులభసాధ్యమగును.

శ్లో॥ ముకున్దమాలాం పఠతాం నరాణా
మశేషసౌఖ్యంలభతేన (కస్స్విత్) (కోవా)
సమస్తపాపక్షయమేత్యదేహీ
ప్రయాతివిష్ణోః పరమం పదంతత్॥ ౧౫॥

టీక॥ ముకున్దమాలాం - భగవంతునికి సంబంధించిన యీ శ్లోక రత్నమాలను, పఠతాం-పఠించుచుండెడి, నరాణాం - మనుష్యులలోపల (కస్స్విత్)-కోవా-ఎవడుగాని అశేషసౌఖ్యం-సర్వసౌఖ్యములను, నలభతే-పొందడు? అనగా అందరును సౌఖ్యములను పొందుదురనుట, దేహీ-దేహధారియైనవాడు, ముకుందమాలా పఠనమువల్ల, సమస్తపాపక్షయం-సర్వపాపక్షయమును, ఏత్య-పొంది, విష్ణోః-నారాయణునియొక్క, తత్-ప్రసిద్ధమైన, పరమంపదం-ఉత్తమమైన స్థానమును, అనగా మోక్షమును, ప్రయాతి-పొందుచున్నాడు.

తా॥ ముకుందమాలఅనే యీ స్తోత్రమును పఠించువారలందరును ఇహలోకమునందు సర్వసౌఖ్యములను అనుభవించి సర్వపాప వినిర్ముక్తులై తుదకు మోక్షమునుగూడ పొందుదురు.

శ్లో॥ యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మవరపద్మశరావభూతామ్ ।
తేనామ్బుజాక్షచరణామ్బుజషట్పదేన
రాజ్ఞాకృతాకృతిరియం కులశేఖరేణ॥ ౧౯॥

టీక॥ ప్రియౌ-లోకులకు ఇష్టులును, శ్రుతిధరౌ - వేదాధ్యయనము చేసినవారును, కవిలోకవీరౌ-కవిజనశ్రేష్ఠులును అగు, ద్విజన్మవరపద్మశరౌ-బ్రాహ్మణశ్రేష్ఠులగు, పద్మనాభుడు బాణుడు అను వారలు, యస్య-ఏకులశేఖరాళ్వారులకు, మిత్రే-స్నేహితులు, అభూతాం-అయిరో, ఇచట 'నామైకదేశే నామగ్రహణం' అను న్యాయముతో పద్మనాభ శబ్దస్థానమందు పద్మశబ్దము ప్రయోగింపబడినది. వృత్తము ననుసరించి ఛందోభంగ భయముతో బాణశబ్దమునకు బదులుగా శరశబ్దము ప్రయోగింపబడినదని తెలియవలయును. శ్లోకమునుబట్టి పద్ముడు శరుడు అనియే వారి పేర్లు. కనుక ఇందునుగురించి మేలాటిశ్రమతో నక్కరలేదని కొందరు. అథవా-కవిలోకవీరౌ, అను శబ్దమునకు కవివీరుడు లోకవీరుడు అని అర్థము. ఈ రెంటికిని ద్విజన్మవరపద్మశరౌ, అనుచోట క్రమముగా అన్వయము, తథాచ-కవివీరుండగు ఒక బ్రాహ్మణశ్రేష్ఠుడును లోకవీరుండగు పద్మశరుడని పేరుగల ఒక క్షత్రియుడును ఎవరికి మిత్రులో అని అర్థము. ఇచట క్షత్రియ శబ్దము లేకపోయినను శ్రుతిధరత్వ లోకవీరత్వ విశేషణములచే పద్మశరుడనువాడు క్షత్రియుడని ఊహించవలయును. ఏకారణమువల్లనో బ్రాహ్మణుని నామము ఇచట చెప్పబడలేదు. నామకరణము మాతాపితృల ఇచ్ఛానుసారముగా నుండునది గనుక ద్విజన్మవర శబ్దమే ఆ బ్రాహ్మణుని పేరనికొందరు ఈ అర్థములో కులశేఖరాళ్వారులకు మహాకవులతోను మహావీరులతోను మైత్రి వర్ణింపబడినందున వీరు మహాపండితులు మహా పరాక్రమవంతులు అని సిద్ధించినది. ఏ విద్యవాడు ఆవిద్యవానితో నేగదా చెలిమిసేయును. అథవా పద్మశరుడనగా మన్మథుడు. అనగా సుందరుడని అర్థము. తథాచ కవివీరుడగు బ్రాహ్మణశ్రేష్ఠుడు

వాల్మీకి, లోకవీరుడగు సుందరుడు శ్రీరాములవారు, వీరిద్దరు కులశేఖ రాళ్వారులకు మిత్రులు, అనగా చన్ద్రి సఖంముఖం అను ప్రకారము ననుసరించి ప్రకృతమందు ప్రతీపాలంకారశైలిగా చెప్పినందున కులశేఖ రాళ్వారులు కవిత్వమందు వాల్మీకివంటివారనియు పరాక్రమమందు శ్రీరాములవంటివారనియు అర్థము. ఈ యర్థములయందు ఎవరికేది ఇష్టమో అది వారుపరిగ్రహించవచ్చును. తేన-ఆ, అమ్బుజాక్ష... దేన— అమ్బుజాక్ష-కమలములవంటి కన్నులుగల విష్ణువుయొక్క, చరణ-పాదము లనెడు, అమ్బుజ-కమలములకు, షట్పదేన-తుమ్మెద అయిన, రాజ్ఞా-రాజైన కులశేఖరేణ-కులశేఖరాళ్వారులచేత, ఇయంకృతిః - ఈ ముకున్దమాల, కృతా-చేయఁబడినది.

తా॥ ఏ కులశేఖరాళ్వారులకు సర్వజనప్రియులును కవి శ్రేష్ఠులును అయిన పద్మనాభకవి, బాణకవి అనువారు యిద్దరు పరమమిత్రులై యుండిరో, అట్టి విష్ణు పాదారవింద మరంద భృంగాయ మాణుండగు కులశేఖ రాళ్వారులచేత ఈ ముకున్దమాల రచింపఁబడినది.

శ్రీకులశేఖరాళ్వార్ తిరువడిగళేశరణం

టీకా తాత్పర్య విశిష్టంబయిన

ము కు న్ద మా ల

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.







శ్రీః

# పఞ్చాయుధ స్తోత్రమ్.

## టీకా తాత్పర్య సహితమ్.



శ్లో॥ స్ఫురత్సహస్రార శిఖాతితీవ్రం । సుదర్శనం భాస్కరకోటి తుల్యమ్
సురద్విషాం ప్రాణవినాశి విష్ణో । శ్చక్రంసదాహం శరణంప్రపద్యే ॥౧॥

టీక॥ స్ఫురత్ - తీవ్రం, స్ఫురత్ -ప్రకాశించుచున్న, సహస్ర-వేయి యయిన, అర-అంచులయందుండెడి, శిఖా-అగ్నిజ్వాలలచేత, అతితీవ్రం-మిక్కిలి తీక్ష్ణమైనట్టిదియు, భాస్కరకోటితుల్యం-కోటిసూర్యులతో సమానమైనట్టిదియు, సురద్విషాం-రాక్షసులయొక్క, ప్రాణవినాశి-ప్రాణవాయువులను నశింపజేయుచున్నట్టిదియుఅయిన, విష్ణోః-శ్రీమన్నారాయణునియొక్క, చక్రం-చక్రమును, అహం-నేను, సదా-ఎల్లప్పుడు, శరణం-రక్షకముగా, ప్రపద్యే-పొందుచున్నాను, అథవా-శరణం, అపేక్షిత కార్యసాధనమందు ఉపాయముగా, ప్రపద్యే-నిశ్చయించుచున్నాను.

తా॥ తన వేయి అంచులయందును జాజ్వల్యమానములగు అగ్నిజ్వాలలచే మహాభయంకరమైనదియు, కోటిసూర్యులు ఒకేసారి ఉదయించినట్టుగా నుండి జనుల కన్నులు మూతవేయుచు ఎవ్వరిచేతను చూచుటకు సాధ్యము కానట్టిదియు, అతిఘోర రాక్షస వీరప్రాణముల నపహరించు

నట్టిదియు, అయిన నారాయణుని చక్రమును నేను సర్వదా శరణుఁ జొచ్చుచున్నాను.

శ్లో॥ విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య । యస్యధ్వనిర్దానవ దర్పహన్తా
తంపాఞ్చజన్యం శశికోటిశుభ్రం । శఙ్ఖం సదాఽహంశరణం ప్రపద్యే॥౨॥

టీక॥ విష్ణోః-నారాయణునియొక్క,ముఖోత్థానిలపూరితస్య - నోటి నుండి పుట్టిన వాయువుచే నింపఁబడిన, యస్య - ఏపాంచజన్యముయొక్క, ధ్వనిః-నాదము, దానవదర్పహన్తా-రాక్షసుల పొగరును పోగొట్టునదియో శశికోటిశుభ్రం-కోటిమంది చంద్రులవలె తెల్లనైనట్టి, తంపాఞ్చజన్యంశఙ్ఖం-ఆ పాంచజన్యమను పేరుగల శంఖమును, సదాహంశరణంప్రపద్యే-సర్వదా నేను రక్షకముగా పొందుచున్నాను. అథవా కార్యసిద్ధికి ఉపాయముగా నధ్యవసించుచున్నాను.

తా॥ యుద్ధమునందు నారాయణునిచే నూదబడి బ్రహ్మాండ కటాహమును పగలగొట్టునట్టుగా మ్రోగెడి దేని ధ్వని విన్నంతమాత్రముతోనే, యుద్ధోద్యుక్తులగు రాక్షసమహావీరులయొక్క పొగరంతయు పోవుచున్నదో అట్టి కోటిమంది చందురులు ఒకేసారి ఉదయించినట్టు జగత్తునంత తెలుపులో ముంచివేయుచుండెడి పాంచజన్యమను పేరుగల శ్రీమన్నారాయణుని శంఖమును నేను శరణుఁజొచ్చుచున్నాను.

శ్లో॥ హిరణ్మయీం మేరుసమానసారాం
కౌమోదకీం దైత్య కులైకహన్త్రీమ్ ।
వైకుణ్ఠ వామాగ్రకరాభి మృష్టాం
గదాం సదాఽహం శరణంప్రపద్యే॥ ౩॥

టీక॥ హిరణ్మయీం-సువర్ణమయమైనదియు, మేరుసమానసారాం-మేరుపర్వతముతో సమానమైనతూకము కాఠిన్యము మొదలగు గుణములు గలదియు, దైత్యకులైకహన్త్రీం-తానొక్కటియే రాక్షస కులమునంతయు సంహరించునట్టిదియు, వైకుణ్ఠవామాగ్రకరాభిమృష్టాం - నారాయణుని యొక్క యెడమచేతితో స్పృశింపబడినట్టి అనగా ధరింపబడినట్టిదియు అయిన, కౌమోదకీం గదాం-కౌమోదకిఅను పేరుగల గదను సర్వదా నేను శరణముగా బొందుచున్నాను, ఇత్యాది పూర్వమువలెనే చూచుకొనవలసినది.

తా॥ బంగారుతో చేయబడినదిగనుకనే రెండవ మేరుపర్వతమువలె నుండునట్టి, అనగా అంత గొప్పదై, అంతటిభారముగలదై, అంతటికాఠిన్యముగలదై, అంతటి మెఱుగుగలదై యుండునట్టిదియు ఇతర చక్రాద్యాయుధ సహాయభావము కోరకనే సకలరాక్షసులను సంహరించునట్టి శక్తిగలదియు, ఆయినట్టి శ్రీమన్నారాయణునిచే ఎడమహస్తముతో ధరింపబడినట్టి కౌమోదకియను పేరుగలగదను శరణుజొచ్చుచున్నాను.

శ్లో॥ రక్షోఽసురాణాం కఠినోగ్రకణ్ఠ
చ్ఛేదక్షరచ్ఛోణితదిగ్ధధారమ్ ।
తంనన్దకంనామహరేః ప్రదీప్తం
ఖడ్గంసదాఽహం శరణంప్రపద్యే॥ ४॥

టీక॥ రక్షోసురాణాం - రాక్షసులయొక్కయు, అసురులయొక్కయు—కఠినోగ్ర కణ్ఠచ్ఛేదక్షరచ్ఛోణితదిగ్ధధారమ్-మిక్కిలి కఠినములైన భయంకరములైన కంఠములను ఛేదించుటవల్ల ఆ కంఠములనుంచి స్రవించుచుండు రక్తముచే వ్యాప్తమైన అంచుగలిగినదియు, ప్రదీప్తం - మిక్కిలి ప్రకాశించునదియు అయినట్టి, నన్దకం - నందకము అని పేరుగల, హరేః-నారాయణునియొక్క, తం-ఖడ్గం, ఆ-కత్తిని, సదా-ఎల్లప్పుడును, అహం-నేను, శరణం-రక్షకముగా, ప్రపద్యే-పొందుచున్నాను, (తక్కువజాతివారు రాక్షసులని) (ఉత్తమజాతివారు అసురులని) రాక్షసులకు అసురులకు వుండు భేదము. ఈరెండు తెగలవారిని లోకులు రాక్షసులనే వ్యవహరించుచున్నారు.

తా॥ మహావీరులగు అనేక రాక్షసులయొక్క కంఠకాండంబులను చ్ఛేదించు సమయంబున ఆ కంఠముల సంబంధంబగు రక్తంబుచే తడిసి ఎఱ్ఱనైన అంచుగలదియు, చక్కగా పదునుపెట్టుటచేత మినమిన మెఱయుచు తన కాంతులను దిగంతములకు, ఎగజల్లుచుండునట్టిదియు, అయిన నందకమను పేరుగల నారాయణుని ఖడ్గమును శరణుజొచ్చెద.

శ్లో॥ యజ్జ్యానినాద శ్రవణాత్సురాణాం
చేతాంసినిర్ముక్తభయాని సద్యః ।
భవన్తిదైత్యా శనిబాణవర్షి
శార్ఙ్గంసదాఽహం శరణంప్రపద్యే॥ ౫॥

టీక॥ యజ్జ్యాని నాదశ్రవణాత్ - ఏశార్ఙ్గముయొక్క, అల్లెత్రాటి ధ్వనిని వినుటవల్ల, సురాణాంచేతాంసి-దేవతల మనస్సులు, సద్యః-తత్కాలమందు, నిర్ముక్తభయాని-విడవబడిన భయముగలవి, భవన్తి-అవుచున్నవో, దైత్యాశనిబాణవర్షి- రాక్షసులయందు పిడుగులవంటి బాణములను వర్షించునట్టి, తత్ శార్ఙ్గం- ఆశార్ఙ్గమని పేరుగల నారాయణుని ధనస్సును, సదాహం శరణంప్రపద్యే-ఎల్లప్పుడు నేను శరణముగా పొందుచున్నాను.

తా॥ రాక్షసులతో సహా మహాఘోరమైన యుద్ధములు జరుగునపుడు రాక్షసుల దాడి నోర్వలేక భయభ్రాంతులైనట్టి దేవతలు ఏ శార్ఙ్గధ్వని వినబడగానే ఇంక రాక్షసులు హతమైపోయిరి, సాక్షాన్నారాయణుండు మనకు సహాయముగా వచ్చుచున్నాడని తలచి అదివరకు హృదయంబులలో జొరబడిన భయంబును విడిపించునదియు అట్టి రాక్షసులయందు పిడుగులు గురిసినట్లుగా బాణములను గురిపించునట్టిదియునగు నారాయణమూర్తియొక్క శార్ఙ్గమను ధనుస్సును సర్వదా శరణు జొచ్చుచున్నాను.

శ్లో॥ ఇమంహరేః పఞ్చమహాయుధానాం
స్తవంపఠేద్యోను దినంప్రభాతే ।
సమస్తదుఃఖాని భయానిసద్యః
పాపానినశ్యన్తి సుఖానిసన్తి॥ ౬॥

టీక॥ యః-ఏపురుషుడు, అనుదినం-దినదినమందు, ప్రభాతే-ప్రాతః కాలమందు, ఇమం-ఈ, హరేః-నారాయణునియొక్క, పఞ్చమహాయుధానాం-పంచ సంఖ్యాకంబులగు శ్రేష్ఠములగు ఆయుధములయొక్క, స్తవం-స్తోత్రమును, పఠేత్-పఠించునో, ఆ పురుషునియొక్క, సమస్తదుఃఖాని-భయాని-పాపానిచ-సమస్తదుఃఖములు, సమస్తభయములు, సమస్తపాపములున్ను, సద్యః - తత్క్షణమందు, నశ్యన్తి - నశించిపోవుచున్నవి, ఆ పురుషునికి, సుఖాని-సమస్తసుఖములు, సన్తి-కలుగుచున్నవి.

తా॥ దినదినము ప్రాతఃకాలమందు ఈ పంచాయుధస్తోత్రమును పఠించువారికి, సమస్త దుఃఖములు, సమస్తభయములు, సమస్తపాపములు నశించి సర్వసౌఖ్యములు కలుగును.

శ్లో॥ వనే రణే శత్రుజలాగ్నిమధ్యే
యదృచ్ఛయాపత్సు మహాభయేషు।
ఇదంపఠన్ స్తోత్ర మనాకులాత్మా
సుఖీభవే త్తత్కృత సర్వరక్షః॥ ౭॥

టీక॥ వనే రణే శత్రుజలాగ్నిమధ్యే-అరణ్యమందు చిక్కినపుడును, యుద్ధరంగమందు చిక్కినప్పుడును శత్రువుల మధ్యమందుగాని ఉదకమధ్య మందుగాని, అగ్నిమధ్యమందుగాని, చిక్కబడినప్పుడును, యదృచ్ఛయా పత్సు-ప్రాప్తాసు-స్వేచ్ఛగా విపత్తులు ప్రాప్తించినప్పుడును, మహాభయేషు-ఇతరవిధములగు యేలాటి భయములు ప్రాప్తించినపుడును, అనాకులాత్మా-ఏకాగ్రమనస్సుగలవాడై, ఇదంస్తోత్రంపఠన్-ఈస్తోత్రమును పఠించువాడు, తత్కృతసర్వరక్షః-ఈస్తోత్రముచేత చేయబడిన సర్వవిధరక్షణలు గలవాడై-సుఖీభవేత్-సుఖవంతుడవును.

తా॥ ఈస్తోత్రమును పఠించువారికి సర్వవిధమైన ఆపదలు సర్వవిధ భయములు తొలగిపోయి సౌఖ్యములు కలుగును.

పంచాయుధస్తోత్రము
టీకాతాత్పర్యసహితము
సంపూర్ణము.



# శ్రీకురుమూర్తి శ్రీనివాస మఙ్గళాశాసనమ్

శ్రీమత్కూర్మాద్రిశైలేన్ద్ర గుహాన్తరవిహారిణే
శ్రీనివాసాయ యోగీశ ధీనివాసాయ మఙ్గళమ్ ॥౧॥

ఇన్దిరానయనానన్ద సున్దరాద్భుత మూర్తయే ।
మన్దిరాయితకూర్మాద్రికన్దరాయాస్తు మఙ్గళమ్ ॥౨॥

ఇన్ద్రనీలమణిస్పర్ధి సాన్ద్రనీలతనుత్విషే ।
సిన్ధుకన్యాకటాక్షస్రగ్బన్ధురాయాస్తు మఙ్గళమ్ ॥౩॥

సనాతనవచస్తోమ ప్రణూతగుణసమ్పదే ।
ఫణీన్ద్రభూధరోత్తంస మణీన్ద్రాయాస్తు మఙ్గళమ్ ॥౪॥

సీతారామనృపోత్తంస ధ్యాతాఙ్ఘ్రిజలజన్మనే ।
శ్రీశైలశ్రీనివాసార్య ధీసేవ్యాయాస్తు మఙ్గళమ్ ॥౫॥

# శ్రీకురుమూర్తి లక్ష్మీ మఙ్గళాశాసనమ్

తుఙ్గకూర్మాద్రిశైలేన్ద్రశృఙ్గ శృఙ్గారవల్లయే ।
అఙ్గనామణయే శౌరేస్తుఙ్గం భవతు మఙ్గళమ్ ॥౧॥

ధామ్నే కస్మైచిదుద్దామభూమ్నే సకలసమ్పదామ్ ।
సీమ్నే పతిభుజామధ్యధామ్నే భవతు మఙ్గళమ్ ॥౨॥

కరుణారస కల్లోలవరుణాలయ చేతసే ।
హరిణాక్షసమానాస్య స్ఫురణాయాస్తు మఙ్గళమ్ ॥౩॥

సురేన్ద్రపురవాస్తవ్య పురన్ధ్రీజనసమ్పదా ।
వీజ్యమానాయ శక్రాదిపూజ్యమానాయ మఙ్గళమ్ ॥౪॥

సీతారామనృపోత్తంస స్ఫీతానన్దవిధాయినే ।
శ్రీనివాససుధీశాన ధీనివాసాయ మఙ్గళమ్ ॥౫॥

కళశజలధికన్యా కాపి లోకైకమాన్యా
కురుమతిగిరి వన్యా కేళిసఙ్ఘాభ్రరధన్యా ।
శుభమతి సుత లక్ష్మీ వాగ్యశో భాగ్యశోభాః
ప్రథయతు భువి సాక్షాద్భక్తపక్షేరముష్యాః ॥౯॥

శ్రీమత్తిరుమల, బుక్కపట్టనాభిజన
"బాలసరస్వతీ" "తర్కతీర్థ" శ్రీనివాసాచార్య విరచిత
శ్రీకురుమూర్తి శ్రీనివాసలక్ష్మీ మఙ్గళశాసనం
సమ్పూర్ణమ్.



శ్రీః

# ఆంధ్ర ముకుందమాల

## శ్రీ కులశేఖరుల కృతికి ఆంధ్రానువాదము




గ్రంథకర్త

శిరోమణి శ్రీ చలమచర్ల రంగాచార్యులుగారు

తాళపత్త్ర గ్రంథ పరిశోధకులు

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు (దక్షిణ)



తారణ భాద్రపదము.

౧౯౪౪

శ్రీ శ్రీనివాసాయనమః

# ఆంధ్ర ముకుందమాల

## కుల దైవ ప్రణుతి.

శ్రీమహిళామ తల్లి విలసిల్ల మెఱుంగు తెఱంగు సజ్జన
స్తోమము సారసాళివలెఁ దోఁపఁగ దాపున మౌనిబృందముల్
ప్రేమ మయూరపాళి క్రియ నృత్యముసల్ప వృషాద్రి సాను భూ
సీమ వెలుంగ నిల్చి సుధఁజిల్కు నవాంబుదమున్ భజించెదన్.

## కులశేఖర ప్రపదనము

ఏరాజు నగరి నిత్యముఁ
గోరిక శ్రీరంగయాత్ర ఘోషింపఁబడున్
ఆరాజు గొల్తు శిరమునఁ
గూరిమి భక్తాగ్రగణ్యు కులశేఖరునిన్.

౨

ఓ శ్రీవల్లభ! యో దయాగుణపరా! యో భక్తమందారమా!
ఓ శ్రీకృష్ణ! భవార్తి కర్తనకృతీ! యో శేషశాయీ! హరీ!
ఓ శ్రీనాథ! జగన్నివాస! యని నోరూరన్ నినుంబిల్చు పు
ణ్యు శ్రీలిమ్ము! ముకుంద! సుందర! యశోదానందకందా! సదా!.

౩

జయము! జయము! దేవా! శౌరి! శ్రీదైవకేయా!
జయము! జయము! కృష్ణా! సర్వ వృష్ణిప్రదీపా!
జయము! జయము! మేఘశ్యామలా! కోమలాంగా!
జయము! జయము! పృథ్వీచక్రపాలా! ముకుందా!

౪

ముకుంద! వందనంబొనర్చి మోదమంద వేడుదే
నొకండె యర్థ మద్దియొప్పుచుండు గోప్యమై, భవ
త్ప్రకృష్ట పాదపద్మమందు త్వత్ప్రసాదశక్తిచే
నకుంఠ భక్తి కలుగుఁగాక! యెన్నిజన్మలందునన్.

౫

వందనమాచరింపఁదమి వారిజనేత్ర! భవత్పదమ్ములం
బొందికవ్రాలి ద్వంద్వములు దోఁవఁగ, నారకబాధ దీఱఁగా,
నందన వాటి సౌఖ్యములు నాకొనఁగూడఁగ; గాని, నిన్నుహృ
న్మందిరమందు నిల్పికొన నూటికిఁగొల్చెద జన్మజన్మముల్.

౬

కోరను ధర్మ, మర్థమును గోరను, గోరను గామభోగముల్
గోరను వేనిఁ, గూడునవి గూడినఁ బూర్వకృతానురూపముల్;
గోరుదు నొక్కకోర్కెమదిఁ గూరిమి మీఱఁగ జన్మజన్మమం
దారనిభక్తి నీ పదయుగాంబురుహంబుల యందుఁ బొందఁగా.

౭

దివినో భువినో నారక
భువినో నాయునికి యగుత! పురుషోత్తమ! నీ
యవధృత శారద సరసీ
భవనిభమగు పాదయుగళిఁ బాడుమునిచ్చల్.

౮

జానగు తావకీన పద సారస పంజరమందుఁ గృష్ణ! నా
మానస రాజహంస మిది మాలిమిఁ జేరెడుఁ గాక! నేఁడె; యా
ప్రాణము వోవునాడు కఫవాతనితాంత నిబద్ధకంఠుఁడన్
బూనిక నీదు నామ మధు పూరములానఁగ నేర్తునేవిధిన్?

౯

సంతతమా హరినే మదిఁ
జింతించెద నందనందు స్మితవదనేందున్
గాంతుఁ బరాత్పరు గోపీ
కాంతుని సురమాని ముఖ్యఘనమునివంద్యున్.

౧౦

కరచరణాబ్జ శోభితము, గాంత దృగంత విలోలమీనమున్
వరభుజ వీచి సంకుల మపార మగాధ మనూనమార్గ మా
హరి సరసిం గడింది మనమారగ డిగ్గి ప్రభూత తేజమున్
సురుచిర వారిఁద్రావి భవ శుష్కమరువ్యథ లెట్లుఁబాయుదున్.

౧౧

శంఖచక్రయుతుని సరసిజనేత్రుని
మురవిరోధి వీడఁబోకు మనస !
హరిపదాబ్జ చింత నామృతమ్మునకన్న
మిన్న సుఖము వేఱె యున్నదొకొ ?॥

౧౨

యాతన లివ్వియివ్వియని స్వాంతమ ! సుంతయు భీతినొందకే
పాతకశత్రువుల్ దరియఁ బ్రాభవమొందరు లెమ్ము ! నీకు శ్రీ
నేతయె స్వామియై నిలుచు నెమ్మనిఁగొల్వుము; లోకదుఃఖముల్
చాతురిఁదీర్చు మేటి యిఁకఁ జాలఁడె దాసుని యార్తిఁదీర్పఁగా ?

౧౩

భవజలధిన్ నిమగ్నులయి ద్వంద్వసమీర హతస్వరూపులై
భవనకళత్ర పుత్రి హిత బాంధవరత్నభారఖిన్నులై
భువి విషయాంబుపూరమున మున్గుచుఁ దెప్పిలలేని వారి కు
త్సవము దలిర్చు విష్ణువను జక్కని నావ యొకండు రక్షయై॥

౧౪

చేతమ ! యీభవాంబునిధి సేరితరింపఁగ రానిదంచు లోఁ
గాతరమొందఁబోకు, హరిఁ గంజదళాక్షుని లోకవంద్యు శ్రీ
మాత యురంబునన్నెగడు మాన్యునఁగూడిన నీదుభక్తియే
చేతికి దండనిచ్చి దరిఁజేర్చవలంతి కలంత లేటికే ?

౧౫

ఘనతృష్ణాజల పూర్ణమై, స్మరమరుత్కల్లోల సంకీర్ణమై,
తనయ గ్రాహ భయంకరంబయి, చలద్దార భ్రమాశీలమై
గసనొప్పారు భవాబ్ధి మున్గెడు మముమ్ గావంగ నీపాద భ
క్తిని నౌకన్ గృపసేయవో వరద ! నేఁ గేల్మోడ్తు నెవ్వేళలన్.

౧౬

నీపద భక్తిహీనులను నిర్గతపుణ్యుల నేభవంబునం
దోపనుజూడ, నస్యకథలూనొన నెంతటి శాస్త్రబంధమున్
జూపినఁగాని, సర్వగుణ శోభితు నిన్మనమందు దూరునా
పాపుల నెంచనేమదిని బాయను నీపదసేవ లెప్పుడున్.

౧౭

చిత్తమా! శ్రీహరిఁ జింతింపు మేవేళ
రసనమా! కీర్తించు రామభద్రుఁ
జేతులారా! మీరు సేవింపుఁడీ విష్ణుఁ
గర్ణంబులార! తత్కథలవినుఁడు
కనులార! గాంచుఁడు కమలనాభుని రూపు
ఘ్రాణమా! తులసీ సుగంధ మాను
పదములార! జనుఁడు పద్మేశు నిలయంబు
శీర్షమా! నతులిడు శ్రీనివాసు
సర్వలోకేశు సేవల సల్పుగతన
పెరటి కల్పకమౌనంట పరమపదము
శ్రీశుఁడే యండగానుండఁ జింతయేల?
కనకగిరి నేలువానికిఁ గఱవుగలదె?

౧౮

వినుఁడోయీ జనులార! జన్మమరణాదుల వ్యథా శాంతికై
ఘనయోగజ్ఞులు యాజ్ఞవల్క్యముఖులౌ కారుణ్యపూర్ణుల్ వచిం
చిన యోగంబిది, స్వప్రకాశమమల శ్రీకృష్ణదివ్యామృతం
బును సేవింపుఁడు దాన గల్గును సుఖంబుల్ నిత్యమత్యంతముల్.

౧౯

వినుఁడీ! మానవులార! యొక్కహితముల్ విన్పింతు సంక్షిప్తమీ
ఘన సంసారపయోధి కష్టతతి భంగవ్యాకులంబందు నీ
దనుమీకెట్లగు? వీడియన్యములు చేతఃప్రీతి దైవాఖ్యగా
మననంబుల్ పలుమారు సేయుఁడు మహామంత్రంబు నష్టాక్షరిన్.

౨౦

ఇలయొక చిన్నరేణు, విసుమింతకణంబు పయోధులెల్ల, నా
పలువిధ తేజమెల్ల నొకపాటిది మిణ్గురు, వాయులూర్పులౌ,
గలుఁగు నభంబు, కీటములు కంజభవాది సురవ్రజంబులే
వెలుఁగు వెలుంగఁ, ద్వన్మహిమ విశ్వమునన్విజయమ్ములొందుతన్!

౨౧

కరములు మోడ్చి, గాత్రమున గగ్గురుపట్టఁగ, గంఠమెంతయున్
స్వరము గలంగ, నేత్రముల బాష్పము జాలులు వార సారెకున్
శిరమునువాల్చి నిల్చి సరసీరుహలోచన! నీదుపాద సం
స్మరణ సుధానుభూతిఁ గనఁజాలెడి జీవిత భాగ్యమీయవే?

౨౨

ఓ గోపాలక! ఓ కృపాజలనిధీ! ఓ సింధు కన్యాపతీ!
ఓ గోవర్ధనధారి! కంసనిధనా! ఓ దుష్ట రక్షాచణా!
ఓ గోవిప్రహిత! రామ సోదరవరా! ఓ పుండరీకేక్షణా!
ఓ గోపీజననాథ! గావుమికఁ నాకన్యుల్లరె? వేఱొక్కరున్.

౨౩

భక్త కష్టములను పాముల దూలించి
గారుడ మణి యగుచుఁ గ్రాలుచుండు
ముల్లోకముల దయ వెల్లివాఱఁగ బ్రోచి
రక్షకమణి యగుచు రహివహించు
వ్రేఁతలచూపుల చాతకమ్ములఁగాచి
యంబుదమణియగుచు సతిశయించు
రుక్మిణి పాలిండ్ల రుచులెసంగఁగఁజేసి
భూషణమణియగుచు పొలుపుమీరు
విశ్వసౌందర్యమునకిద్ది విజయమణియొ
సకల గుణముల రాశియీసారమణియొ
దాసులకునెల్ల నిద్ది మందారమణియొ
భద్రములుగూర్చు గోపాల బాలమణియొ.

౨౪

మంత్రంబిద్ది విరోధిభేదనమునన్ మంత్రంబుశ్రుత్యుక్తమున్
మంత్రంబిద్ది భవాబ్ధితారణమునన్ మంత్రంబు మోక్షాప్తికిన్
మంత్రంబిద్ది రమావిలాసములకున్ మంత్రంబురక్షాప్తికిన్
మంత్రంబిద్ది పఠింపు కృష్ణయను సన్మంత్రంబు జిహ్వా! సదా.

౨౫

ఔషధమాను మోహహారి, కౌషధమా మునిచిత్తవృత్తి, ధూ
ర్తౌషధమాసురాళి, కమలౌషధమా జగమెల్లఁగావ, ది
వ్యౌషధమాను భక్తతతి, కౌషధమా భవబంధహాని, కృ
ష్ణౌషధ మీవుద్రావు మనమా! గనుమా! సకలేష్టసిద్ధులన్.

౨౬

సతతమరణ్యరోదనము సచ్ఛ్రుతిపాఠము లెల్ల, వైదిక
వ్రతములు గార్ద్యమాత్రఫలవంతము, లయ్యయిపూర్తధర్మముల్
క్రతువులు భస్మహోమములు, గానఁగఁ దీర్ఘజలాభిషేకముల్
వితథగజావగాహనము విష్ణుపదమ్ముల భక్తి లేనిచో.

౨౭

శ్రీనారాయణ యన్న దివ్యపదమున్ జెన్నార వాక్రొంటకుం
బూనం, బాపులకైన వాంఛితములబ్బుందాన, నావాక్కు దా
నా నారాయణ నామకీర్తనము సేయంబోదు మున్నందుచే
నే నీ గర్భనివాస దుఃఖముల నెంతే బొందినానయ్యయో!

౨౮

ఓ మధుకైటభారి! ఫలముర్వీని నిద్దిమదీయ జన్మకున్,
నే మనసారఁగోరునది, నీదు ప్రసాదము నిద్దె గావలెన్;
స్వామి! త్వదీయభృత్య పరిచారక భృత్య తదీయభృత్య ప
త్త్రామ రసైకదాసులకు దాసుఁడనంచు దలంచు నన్ గృపన్.

౨౯

మనకు విభుండు, ముజ్జగము మన్నెడిజోదు, మనంబుచేత నే
యనయము సేవ్యుఁడెల్లరకు, నాత్మపదంబు నొసంగుదాత, యా
దనుజవిదారి, శ్రీపతియె దండనునుండ, విహీను నల్పు న
మ్మనుజుని సేవకై వెదకు మందులమైతిమి యెందు నక్కటా!

30

స్మర! విడుమా! ముకుందపద సారసరోజ మరంద ధారలం
బరమపునీతమై వెలుఁగు మామక మానస మందిరంబునన్;
హర నయనాగ్ని మున్నె పసయంతయు వోయి కృశించినావు, మా
మురహారి చక్రవిక్రమము మూఢ! దలంపున కింతవచ్చునే?

౩౧

పలుకుము నారాయణ యన్
బలుకులు జిహ్వాగ్ర! నీకుఁ బ్రణమింతు సదా
ఫలములు పరతత్త్వమ్ములు
సెలఁగఁగఁ గ్రొందేనె లొలుకఁ జిలుకుంగాదే?

౩౨

ఇది యొకనాఁడు నిక్కముగ నెంతయువీడుచు సంధిబంధముల్
ముదిమినిఁ జిక్కి వ్రక్కలయి పోయెడిదేగద! మేను, దీనికై
వెదకఁగనేల మందులను వీటిడి! కృష్ణరసాయనంబిదే
ముదమునఁ ద్రావు మీవు వడిఁబొందుము పొందు మమంద నిర్వృతిన్.

౩౩

సిరియిల్లాలగు, దమ్మిచూలి కొడుకై చెన్నొందుఁ, బ్రాఁబల్కులున్
సరికై వారము, వేల్పుదండు నిజదాసవ్రాత, మాముక్తి త్వ
ద్గురు కారుణ్యఫలంబు, మాయ జగముల్, గుంతీసుతుండాప్తుఁడౌ
హరి! శ్రీదేవకి తల్లి; నిన్విడిచి నే నన్యంబెఱుంగన్ ప్రభూ!

౩౪

కృష్ణుఁడు రక్షమాకగుతఁ, గృష్ణునిఁ గొల్తును భక్తినేను, శ్రీ
కృష్ణునిచే నరుల్గనిరి కీడల కృష్ణునికై నమస్సు, మా
కృష్ణుని నుండియే జగము రెక్కెనెఁ, గృష్ణుని కేను దాసుఁడన్
గృష్ణుని యందె నిల్చు భువి కృష్ణుఁడ! బ్రోవుము నన్నుగూరిమిన్.

౩౫

కరుణాళుండవటంచు నీవు గడు విఖ్యాతింగదా! గంటి వో
హరి! యీ దీను ననుగ్రహింపు, కృపలేపారం గటాక్షింపు, భీ
కర సంసార మహాబ్ధి మగ్నుఁడను నన్గావంగనర్హుండ వీ
ధర నీకెవ్వరుసాటి? మేటి పురుషోత్తంసంబ వీవే గదా!

౩౬

నారాయణుఁగొల్తును శ్రీ
నారాయణు పాదసేవ నమ్మికఁజేతున్
నారాయణ యని పల్కుదు
నారాయణుఁ బరముదలఁతు నామనమారన్,

౩౭

మ ం జ రి

శ్రీ నాథ! యచ్యుతా! శ్రీ చక్రపాణి!
శ్రీ రామ! పద్మాక్ష! శ్రీ పద్మనాభ!
శ్రీ విష్ణు! ప్రియభక్త! శ్రీ వాసుదేవ!
శ్రీ కృష్ణ! మురహారీ! శ్రీ కైటభారి!

౩౮

ఓ యనంత! కృష్ణ! యో హరి! వైకుంఠ!
యో ముకుంద! యటంచు నల్లమలరఁ
బలుకఁ గలిగికూడఁ బలుకఁడొక్కండిల
నౌర! జనుల కెంత వ్యసన నిరతి!

౩౯

ముదమున నెవ్వరా పరమ పూరుషు దివ్యు ననంతు నవ్యయున్
విదళిత భక్తభీతుఁ బ్రభవిష్ణుని జిష్ణుని విష్ణుఁ గృష్ణునిన్
హృదయ సరోజ మధ్యమున నింపుగఁ గొల్తురొ వారు తన్మహా
పదమును వైష్ణవంబు ముని వంద్యము నొందఁగలార లెంతయున్.

౪౦

సు గం ధి

క్షీరసాగరోర్మి దివ్య శీకరప్రసారముల్
సేరి తార హారమట్లు జెన్ను మీఱుమూర్తి దై
వార భోగి భోగసీమఁ! బవ్వళించు మాధవున్
గోరి కొల్చి లీల శ్రీముకుందమాల గూర్చితిన్.

౧

అదియే మేను శిరంబు నల్లయదె కృష్ణాంఘ్రి ద్వయీధూళితం
బదె గన్నుంగవ దేనఁ బద్మనయనుం డాలోకితుండౌనొ, య
య్యదియే బుద్ధి ముకుంద పాద యుగళీ ధ్యానైక మత్తంబునౌ
నదియే జిహ్వయనంగఁ జెల్లు సుధలేపారం హరిం గొల్చుచో. *

౨

చక్రము దాల్చువాఁడు, ఫణి చక్రమునన్ శయనించువాఁడు, రాట్
చక్రము గాచువాఁడు, సుర చక్రము నేలెడివాఁడు, కుక్షి భూ
చక్రము గూర్చువాఁడు బుధ చక్రము సన్నుతిసేయువాఁడు నౌ
చక్రి నుపక్రమించు మనసా! నుతియింపఁగ; మాను వక్రముల్.

3

శ్రీనాథ! కంసఘ్న! శ్రీచక్రపాణి!
శ్రీయచ్యుతా! హరి! శ్రీ శార్ఙ్గపాణి!
శ్రీపద్మదళనేత్ర! శ్రీ పద్మనాభ!
శ్రీ విష్ణు! మురహారీ! శ్రీకైటభారి!

౪

ఓ యనంత! రామ! ఓ జనార్దన! హరీ!
ఓ ముకుంద! యంచు నుల్లమలరఁ
బలుకఁ గలిగి కూడఁ బలుకఁ డొక్కండిల
నౌర! జనులకెంత వ్యసన నిరతి!

౫

శ్రీహరి నామకీర్తనముఁ జెన్నెసలారఁగ నాలకించియున్
దేహముపొంగి యెవ్వనికి దీటునఁ బుల్కలు దళ్కులొత్తవో
స్నేహము మీఱి కన్నుగవఁ జిందదొ నిర్మల బాష్పధార, సం
దేహమె? వాని జీవితము నిక్కము వ్యర్థము, హీనుఁడాతఁడున్.

---

* ఈ పద్యము మొదలుగా పదునైదు పద్యములు, ఉత్తర దేశపు ముకుందమాలలో నధికముగ గన్పడు శ్లోకములకు అనువాదము.

౬

భీకరవృత్తి నీ విషయ భిల్లురు దోఁచిరి జ్ఞానవిత్తముల్,
జేకొని మోహకూపమునఁ జిక్కఁగఁ ద్రోసిరి యంధునన్ను, నో
శ్రీకర! దేవదేవ! సరసీరుహలోచన! భక్తవత్సలా!
నీకయి దండనిచ్చి నను నెవ్వగమాన్పి సముద్ధరింపవే!

౭

ఔర! మనుష్య లోకమున నన్నియుఁ జిత్రము లయ్యె; మేలు దై
వారు సుధారసంబులను వద్దని త్రావక, కాలకూటముల్
గోరిక జుఱ్ఱుచుందురిటఁ, గూళలు, శ్రీహరి గోచరమ్ములౌ
సారపదంబులన్విడచి సారెకుఁ బల్కుదు రన్యవాక్కులన్.

౮

తొలఁగి పోయిన బంధువుల్ దొలఁగనిమ్ము
దూఱఁ దొరకొన్న గురువులు దూఱనిమ్ము
విశ్వనందనుఁడైన గోవిందుఁడతఁడె
నాకు జీవనమని నెమ్మి నమ్మినాను.

౯

చేతమ! చింతసేయు హరి!, జిహ్వ! పఠించు, శిరంబ! వాల్చుమా;
చేతులు! బట్టుఁడంజలినిఁ, జేరిక సాఁగిలి మ్రొక్కుమంగమా!
చాతురి మీఱ నాత్మ! పడి సంశ్రయణమ్మొనరింపు ముక్తికై
నేత వృషాద్రివాసుఁడగు నీరజనేత్రుఁడె ముఖ్యదైవమౌ.

౧౦

కరమిదె యెత్తిచాఁటెదను గాక! నిజంబని యన్నలార! 'యో
నరహరి! యో ముకుంద! సురనాథ! జనార్దన!' యంచు నిత్యముం
గరము జపించి మేన్మఱచి కట్టయొ, తాయియొ నాగనొప్పు స
త్పురుషున కిచ్చుఁ గోర్కె రణభూమినొ యంత్యము నందొ కృష్ణుఁడే.

౧౧

అనురాగంబున నాలకింపుఁడిదిగో హస్తంబు పైకెత్తి నే
ఘన ఘోషమ్మునఁ జాటుచుంటి నిటనో కల్యాణ బుద్ధుల్ మహా
మునులారా! భవఘోర తీవ్ర విషముం బోకార్పఁగా నెందు నో
పును నారాయణ యన్న మంత్ర మొకటే భూమండలంబంతటన్.

౧౨

చిత్తంబింతయు వీడి రాదు క్షణమున్ శ్రీకృష్ణ పాదాబ్జముల్
హత్తెన్, దూఱఁగనిమ్ము బంధువులు; నా యాచార్యులున్ వీడ నీ
మొత్తంబై గృపసేయనీ; వదరనీ మూఢాళి; వాదంటనీ;
మత్తంబైనది నామనంబు ప్రభు ప్రేమ స్వాదుతా రక్తినిన్.

౧౩

చాలుం జాలును కృష్ణ! కృష్ణ! యనునా సద్వాణి దా నొక్కటే
యీ లోకమ్ము గడించు పాతకము లెంతేఁ బాపివేయంగ, గో
పాల గ్రామణి యా ముకుందు నెడనే భక్తుల్ పిసాళించుచో,
నాలోకింపఁడె చేతిలోనె యప్పుడే యామోక్ష సామ్రాజ్యమున్.

౧౪

మవ్వముగా ముకుంద గుణమాలిక భక్తిఁ బఠించు వారిలో
నెవ్వఁడు పొందకుండెడు నహీన మశేషమ్మునైన సౌఖ్యమున్?
అవ్విభు పాదదాసుఁడగు నాతఁడు పాప విముక్తుఁడై గడున్
దవ్వులనుండు నా హరిపదమ్ము ముదమ్మునఁ బొందు నమ్మికన్.

౧౫

శ్రుతి ధరులైనవారు, కవి శూరులు పద్మ శరాభిధానులా
హితులు సుహృద్వరేణ్యులయి యింపెసలారెడి భాగ్యశాలి, శ్రీ
పతి చరణారవిందముల బంభరమై వెలుగొందు మూర్తి, భూ
పతి కులశేఖరార్య కవి పండిన భక్తి రచించె నీకృతిన్.

౧౬

రంగని కీర్తి సౌరభము రాజిలు నీకృతి నాంధ్రులెల్ల దు
ష్ప్రాంగి పఠించి సద్గతినిఁ బొందెడి రీతిఁ దెలుంగు బాసలో
రంగుగ వెల్వడంబఱచి రాణ వహించిన భాగ్యలక్ష్మి శ్రీ
లంగనుగాక! సూనుఁడు కుల ప్రవరుండగు సోమ భూపుతో.

* * *

శ్రీ కురుమూర్తి శ్రీనివాసార్పణమస్తు.

మంగళము.

# సవరణ పట్టిక

## ముకుందమాల

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౧౬ | చరణయోర్ద్వన్ధ్వం | చరణయోర్ద్వన్ద్వం |
| ,, | ౨౬ | నండు | నందు |
| ౫ | ౮ | (ఆస్తి) | (అస్తి) |
| ౬ | ౧౧ | | పఞ్జరాన్తమద్యైవ<br>పఞ్జరాన్తరద్యైవ<br>పాఠద్వయం. |
| ౮ | ౧౭ | శంకచక్ర | శంఖచక్రి |
| ,, | ౨౯ | పరిభ్యోనమః | పరిభ్యోరమః |
| ౧౧ | ౩ | నీద్దైవ | నీద్దైన |
| ,, | ౧౭ | ధార | దార |
| ౧౩ | ౧౯ | యజ్ఞ | యాజ్ఞ |
| ౧౫ | ౧౭ | విష్ణోరవిత | విష్ణోరమిత |

## లక్ష్మీ మంగళాశాసనము

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭ | ౧ | కళశ | కలశ |
| ,, | ౭ | మఙ్గళశాసనం | మఙ్గళాశాసనం |

## ఆంధ్ర ముకుందమాల

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౨౪ | యెన్ని | యన్ని |
| ,, | ౨ | దోవగ | వోవగ |
| ,, | ౧౬ | నిబద్ద | నిబద్ధ |
| ౩ | ౨౪ | లెట్ల | లెల్ల |
| ౪ | ౧౬ | మాన్యునుని | మాన్యుని |
| ౫ | ౨౦ | చేత(ప్రీతి | చేతఃప్రీతి |
| ,, | ౨౨ | ఫలువిధ | పలువిధ |
| ౬ | ౬ | దుష్టరక్షాచణా | దుష్టశిక్షాచణా |
| ౧౧ | ౨ | భిల్లురు | భిల్లులు ♦ |

♦ కంటికి కనఁబడిన తప్పులను సవరించితిమి. ఇంకను అక్షరస్ఖాలిత్యమున్న పాఠకులు సవరించుకోవలెను.

౯౨

జల మందలి రసమ్ము,
సవితృశశి వాత్రుకు లందలి తేజంబు నైన వాని;
ప్రాణిమ్ము లందలి ప్రణవంబు,
నాకాశ మందలి శబ్దమ్ము నైన వాని;
భూమి యందలి గంధమును,
హవ్యవాహను నందలి తేజంబు నైన వాని;
అఖిలభూతంబుల యందలి ప్రాణంబు
మౌను లందలి తపం బైన వాని,
సకలభూతములకు జననకారణ మగు
నాదిబీజరూప మైన వాని,
మూఁడు గుణములకును మూలం బయిన వాని,
నిన్నుఁ గొలుతుఁ గరుణ నింపుము ప్రభు!

౯3

సర్వజ్ఞుఁ డగు వాని, శాశ్వతుఁ డగు వాని,
నఖిలనియామకుఁ డైన వాని,
నణువునకంటె సూక్ష్మాకృతి యగు వాని,
నన్నింటిఁ బోషించు నట్టి వాని,
నంతరింద్రియముల కందఁబోవని వాని,
నాదిత్యవర్ణుఁ డైనట్టి వాని,
ప్రకృతికతీతుఁడై పరిఢవించిన వాని,
నక్షరబ్రహ్మ మైనట్టి వాని,
నిత్యనిర్మలానందుఁడై నెగడు వాని,
నిన్ను సంతతాభ్యాససన్నిహితుఁ జేసి,
భవతరణ మైన యేకాంతభక్తి లోనఁ,
బట్టి సేవించి, ముక్తిని బడయుదుఁ బ్రభు!

౯౮

అంతటఁ జరియించు నా మహావాయువు
నిండి యాకాశమం దుండు నట్లు,
సకలభూతంబులు సర్వమయుఁడ వగు
నీ యందె నిత్యంబు నిండి యుండు;
ఆత్మమాయ నెవాని నడఁగింతుఁ బొడిగింతు,
వాని నీ వంటని వాఁడ వగుట;
సృష్టిక్రియల కుదాసీనుఁడ వగు నిన్నుఁ
గట్టంగ నేర వే కర్మములును;
నీవధిష్ఠాతవై యున్న నీప్రకృతియె
సృజనఁ గావించు చుండు నీసృష్టి కెల్ల,
సాక్షివై యుండి, నీవె శాసకుఁడ వగుదు,
నీమహాత్త్వంబుఁ దెలియంగ నేర్తునె ప్రభు!

గాథ

భూతభావనుఁడును, భూతేశ్వరుండును,
భూతపాలకుఁడు, విభూతియుతుఁడు, నగు
నిన్ను నీవె యెఱుఁగుదువు గాని,
యెవ్వరు నిన్నెఱింగిన వారు లేరు;
అఖిలలోకములు నీయైశ్వర్య మయములు,
సర్వవిభూతి కీశ్వరుఁడ వీవు;
ఏచింతనమున నిన్నెఱుఁగుదు,
నేవస్తుదృష్టిలో నిన్నుఁ జింతింతు కొందు;
సకలవిశ్వసౌభాగ్యము, సర్వమయము నైన
యాత్మవిభూతిరహస్య మెఱుఁగఁ జేసి,
సుజ్ఞానసంపన్నుఁ జేసి నన్ను,
నిత్యసత్యవిభూతిలో నిలుపుము ప్రభు!

౯౬

అగణితనేత్రుండవై యొప్పుటయె కాక,
పరికించు చుంటివి బహు ముఖముల;
అగణితతేజుండవై యొప్పుటయె కాక,
ప్రసరించు చుంటివి బహు కరముల;
అగణితరూపుండవై యొప్పుటయె కాక,
ప్రచరించు చుంటివి బహు పదముల;
అగణితభూతాత్మవై యొప్పుటయె కాక,
పాలించు చుంటివి బహు ప్రకృతుల;
అఖిలమయుఁడును నఖిలాత్ముఁ డైన నీవు,
గాని దేదియు లేదు లోకముల యందు;
కంటి నీవిశ్వరూపంబుఁ,
గంటి నీమహాత్వ మెల్లఁ గృతార్థుఁడ నైతిని ప్రభు!

౯౭

అభిమానముఁ ద్యజించి, యాసల నడఁగించి,
సకలేంద్రియంబుల సద్దణంచి,
అఖిలకర్మముల నీకర్పించి, సమబుద్ధి
నంతరాసక్తి నేకాంతభక్తి నిన్ను ధ్యానించుచు,
నిన్నుపాసించుచుఁ, జిత్తంబు నీయందె హత్తఁ జేసి,
జననమరణరూపసంసారసాగర తరణమున
కుదాత్తకరణమైన నీపవిత్రనామ
నిర్మల స్మరణంబుఁ జేసికొనుచుఁ,
దొల్లి చేసికొన్న పాపరాశి దుల్చి,
భవబంధము లెడల్చు వారె
నిన్నుఁ జేరువారలు ప్రభూ!

౯౮

అది నిరతిశయ మైనది;
అది సత్తు గానిది;
అసత్తును గాని, దది సమస్త
మావరించుకొని యున్నది;
అది సకలేంద్రియముల వెలిఁగించునది;
అది గుణరహిత మైనది;
సంగరహిత మైనది;
అది యఖిలంబు భరియించునది;
అది బహిరంతరముల నిండినది;
అది సూక్ష్మమై యిది యని తెలిసి
యూహింప రాని
దది విమూఢుల కెల్ల దవ్వగు నది;
విబుధాళికి సమీపమై యుండు నది;
జగమ్ముల నేలు నది;
అది యద్వయమే యగునది;
అది పరమ మైన సీతత్త్వమైనది ప్రభు!

౯౯

ఇది పదాడంబరమే లేని సుగమన, ఇది సుబుద్ధి
గ్రహించి యేలికొనుము;
ఇది యలంకారవిస్తృతిఁ గోరని
శుభాంగి; ఇది స్వభావ
గ్రహించి యేలికొనుము;
ఇది చిత్రవృత్తంబు లెఱుఁగని సౌశీల్య; ఇది సుజాతి
గ్రహించి యేలికొనుము;
ఇది భావశైథిల్య మొదవని నిర్మల, ఇది సుభద్ర
గ్రహించి యేలికొనుము;
ఇది పవిత్ర, యయోనిజ,
ఇది యనంత భక్తిభావ సంకీర్తనాభ్యాస
యోగయాగసంజాత,
ఇది మదీయాత్మజాత,
ఎలమి నర్ధాంగిగ గ్రహించి యేలుము ప్రభు!

౧౦౦

నీకులకాంతను నే నౌదు నన్న,
గోత్రంబు నెఱుంగ, సూత్రంబు నెఱుఁగ;
నీభోగకాంతను నేనౌదు నన్న,
మన్మథశాస్త్ర మెఱుఁగ, సమ్మానము నెఱుఁగ
నీకీర్తికాంతను నేనౌదు నన్న,
విశ్వవ్యాప్తి నెఱుఁగ నైజంబు నెఱుఁగ;
నీముక్తికాంతను నేనౌదు నన్నఁ,
దత్త్వంబు నెఱుంగఁ దాదాత్మ్య మెఱుఁగ;
ఏమి యగుదునో నీకు నేనెఱుఁగఁ గాని,
భావసంకీర్తనములోన, భక్తిలోన నల్లితి—
సువర్ణ శతమాన—మది గ్రహించి తేని,
"జీవేశ్వరుఁడ" వని మొఱుఁగుదుఁ బ్రభు!

౧౦౧

ఇచట సందేహార్తియే సంతతం బుండు,
అచట నిర్దేహారాజ్యసుఖ ముండు;
ఇచట భవక్లేశమే కాపురం బుండు,
అచట నజానంద మమరి యుండు;
ఇచట వ్యయారిష్టమే క్రమ్ముకొని యుండు,
అచట నవ్యయపరమార్థ ముండు;
ఇచటఁ బ్రకృతిమాయయే యేలికొని యుండు,
అచట నిత్యబ్రహ్మ మలరుచుండు;
ఇచట మఱపుండు, నెఱుకయే యచట నుండు,
ఇచట గుణముండు, నిర్గుణ మచట నుండు,
ఇచట లయ ముండు, మోక్షమే యచట నుండు,
ఇచట నచ్చట, నన్ను, ని న్నెఱిఁగితిఁ బ్రభు!